16.2.1996 శుక్రవారం 10 పేజీలు సంపుటి:68 సంచిక:07 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

శుభాకాంక్షలు

నెల్లూరీయుల మానసాల్లో చిరస్థాయిగా నిలిచి పోయేలా జరిగిన

శ్రీ బోడా చిదంబరం గారి కుమార్తె

సుధ - నవీన్‌ల

వివాహ శుభసందర్భంలో మా హృదయపూర్వక శుభాకాంక్షలు.

Rtn. PHF డి.సి. హరిబాబు

శ్రీ రాఘవేంద్ర కలర్ ఆటో జెరాక్స్

నెల్లూరు.

### ఎప్పుడు హరీమంటుందో తెలియదు!

# చంద్ర ప్రాణం హరి ఆవేశంలో!

ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు పరిస్థితి అగమ్య గోచరంగా తయారైంది. ఎన్టి రామారావు మరణం తర్వాత తనకు ఎదురే వుండదని ఆయన భావించారు. ఎమ్మెల్యేలు ప్రక్క చూపులు చూడలేరని, తాను ఏమి చేసినా సహించి పడి వుండటం తప్ప వారికి మరేదారీ లేదని సంతోష పడ్డారాయన. దానికితోడు ఎన్టీఆర్ శవం విషయంలో, మరణ సమయం విషయంలో లక్ష్మి పార్వతి పట్ల తనమనరించిన వైఖరికి కుటుంబ సభ్యులందరూ - ఒక్క తోడల్లుడు తప్ప - సమ్మతి తెల్పడంతో రాజకీయంగా కూడా వారు తనను సమర్థిస్తా విశ్వాసం కల్గింది. ఆ నిశ్చింతతోనే ఆయన ఇటీవల తన వైఖరి మార్చుకున్నారు. కాని, వున్నట్లుండి పరిస్థితి మారిపోయింది. అనూహితంగా ఆయనకు హరికృష్ణ రూపంలో ప్రమాదం ముంచుకొని వచ్చేస్తున్నది. ఏ రోజు ఏమి జరుగుతుందో తెలియని అయోమయావస్థలో చిక్కి పోయారాయన.

చంద్రబాబుకు ఇప్పుడు తోడల్లుడు వెంకటేశ్వర రావు, లక్ష్మి పార్వతిలు బహిర్గత శత్రువులైతే; హరికృష్ణ అంతఃపుర శత్రువై పోయాడు. వారిది తెలిసిన పేచీ; ఈయనది లోలోపల రగుల్కొనే దావానలం. హరికృష్ణలో ఎందుకు వచ్చిందో, ఎవరు ప్రేరేపించారో కాని చంద్రబాబు పేరు

**చంద్రబాబు, హరికృష్ణల మధ్య రగుల్కొంటున్న స్పర్ధలు తెలుగుదేశం పార్టీలో మరొక చీలికను కళ్ల ముందు సాక్షాత్కరింపజేస్తున్నాయి!**

చెప్తేనే మహా ఆవేశ పడిపోతున్నారు. హరికృష్ణ ఆవేశం చాలా ప్రమాదకర మైనది. తండ్రి కంటే మూర్ఖత్వం జాస్తి, ఆవేశం తన్నుక వస్తే తానేమి చేస్తాడో, ఏమి మాట్లాడుతాడో వూహించడం కష్టం; ఆయన్ను నిలువరించడం ఇంకా కష్టం. ఆ భయంతోనే రాజ్యసభ సీట్ల విషయంలో చంద్రబాబు తనకు ఏ మాత్రం ఇష్టం లేని లక్ష్మి ప్రసాద్‌కు టిక్కెట్ ఇచ్చారు. ఆ సమస్య తాత్కాలికంగా సమసి పోయినట్లు కన్పించి నప్పటికీ, హరికృష్ణ ఆవేశం మాత్రం దానితో సంతృప్తి పడలేదు. లక్ష్మి ప్రసాద్‌కు టిక్కెట్ ఇవ్వడం ద్వారా చంద్రబాబు తనకు ఫేవర్ చేశాడని ఆయన భావించడం లేదు; తను పోరాడి న్యాయం సాధించానని, ఇదే పోరాటం ద్వారా తాను ఇంకా ఎన్నో పనులు సాధించ గలనని నమ్ముతున్నాడు. ఆ అభిప్రాయంతోనే పేచీ వస్తున్న దిప్పుడు.

ఆ వుద్దేశ్యంతోనే మంత్రి పదవికి రాజీనామా విషయంలో చాలా పట్టుదలతో వ్యవహ రిస్తున్నాడు. ఎట్టి పరిస్థితిలో తానిక మంత్రిగా కొనసాగడం జరగదని, ఏదో ఒక ఎన్నికలో గెల్చిన తర్వాతనే తాను మహరాజు లాగా మంత్రి పదవి స్వీకరిస్తానే తప్ప, ఎవరి దయా దాక్షిణ్యాలు తనకు అవసరం లేదని హరికృష్ణ గట్టిగా చెప్తున్నారు. ఆయనిప్పుడు యువతకు ప్రాధాన్యత అనే వివాదం లేవదీసి వున్నారు. పార్టీ పదవులు, ప్రభుత్వ హోదాలు 70 శాతం యువకులకు ఇవ్వాలని పట్టుబడ్తున్నారు. యువకులు అంటే హరికృష్ణ ఉద్దేశ్యంలో తన అనుచరులని! నిజామాబాద్‌లో ఒక శిలా ఫలకం విషయంలో హరికృష్ణ నేరుగా చంద్రబాబుతో పేచీ పెట్టుకొని రగడ సృష్టించారు.

హరికృష్ణ స్పీడు ఎమ్మెల్యేలకు సంతోషం కల్గిస్తూంది. చంద్రబాబుకు మంచి స్పీడ్ బ్రేకర్ ఏర్పడిందని వారు సంతోషి స్తున్నారు. ఈ మాత్రం అదుపు లేకుండా పోతే ముఖ్య మంత్రి తమను పురుగుల్లాగా చూస్తాడని వారి భయం. కొందరు ఎమ్మెల్యేలు హరికృష్ణను రెగ్యులర్‌గా కలుస్తున్నారు; చంద్రబాబు పై చాడీలు చెప్తున్నారు; వాటితో హరికృష్ణలో మరీ ఆవేశం పెరిగి పోతున్నది.

ఎన్టీఆర్ సమస్య తొలగి పోయిందన్న సంతోషం పట్టు మని పది రోజులు కూడా నిలువక ముందే హరికృష్ణ ఇంట్లో సమాంతర అధికార కేంద్రం ఏర్పడడంతో ముఖ్య మంత్రికి వూపి రాడడం లేదు. ఆవేశంలో ఎప్పుడే ప్రమాదం తెచ్చి, కొంప ముంచు తాడోనని ఆయన హడలి చస్తున్నారు. లోకసభ ఎన్నికల వరకైనా హరికృష్ణను సముదాయించి, సర్ది బెట్టాలన్నది

**ముఖ్యమంత్రి సమయమంతా బావమరిది అలుక తీర్చనే సరిపోతూంది!**

చంద్రబాబు సంకల్పం. అందువల్లే ఆయన హరికృష్ణ ప్రకటనలు

కొరవ 6 పేజీలో

# రాజ్యసభలో పరాభవం తప్పదా?

రాజ్యసభ ఎన్నికలు బాబు తెలుగు దేశం పార్టీకి అతిపెద్ద ప్రతిష్టా సమస్యగా పరిణ మించాయి. ఆరవ స్థానం కూడా గెల్చుకొని, తోడల్లుడు

**కోడ్ నంబర్లు క్రాస్ ఓటింగ్‌ను నిలపలేవు; కాపలాలు కాసుల గలగల ఆపలేవు!**

డాక్టర్ వెంకటేశ్వర రావును రాజకీయంగా శాశ్వతంగా సంహరించాలనే గట్టి పట్టుదలతో ముఖ్యమంత్రి ఆరవ అభ్యర్థిని నిలిపారు. అయితే ఆర్థికంగా స్థోమత వున్న వారినెవరినైనా అందుకు ఎంపిక చేసి వుంటే తనకు కొంచెం వెసలు బాటు వుండేది. అదనపు ఓట్లు ఆకర్షించ డానికి ఆ అభ్యర్థి తన తంటాలు తాను పడి వుండే వాడు. కాని ఆ స్థానంలో కడప రామచంద్రయ్యను నిలబెట్టడం వల్ల మొత్తం భారం తానే మోయ వలసి వస్తున్నది. అదిగాక లక్ష్మి పార్వతి వర్గం నుంచి పెద్ద సంఖ్యలో ఎమ్మెల్యేలు తన వద్దకు వచ్చేస్తారని ఆయన వూహించాడు. ఆ అంచనాతోనే ఈ సాహసం చేశాడు. ఇంటలిజెన్స్ వర్గాల సమాచారం ప్రకారం ఆయన ఎమ్మెల్యేల వలసను వూహించారట. కానీ అది జరగలేదు. 34 ఓట్ల నిలకడతో వెంకటేశ్వర రావు నింపాదిగా కూర్చొని వున్నారు. కేవలం 8 లేదా 9 ఓట్లు వస్తే ఆయన గెల్చినట్లే; రాకున్నా రామ చంద్రయ్యకు 10, కాంగ్రెస్‌కు 26 నుంచి 30 ఓట్లకు మించి వచ్చే అవకాశం లేదని తేలడంతో ఎలిమినేషన్ ప్రాసెస్‌లో తన 34 ఓట్లతోనే గెల్చిపోయే అవకాశం వుంది ఆయనకు. అది జరగడం చంద్రబాబుకు ఇష్టం లేదు; దాన్ని ఆపడమూ చేతే కావడం లేదు.

**వెంకటేశ్వర రావు ఓటమి కోసం నిల బెట్టిన ఆరవ అభ్యర్థి గెలుపు అసాధ్యమని తేలిపోయింది. పరువు నిల్పుకొను రకరకాల కసరత్తులు చేస్తున్నారు!**

ఇంకొక ప్రక్క తన ఎమ్మెల్యేలలోనే కొందరు క్రాస్ ఓటు చేసే ప్రమాదం వుందన్న వార్తలు ఆయన్ను మరీ కలవర పెడుతున్నాయి. శేషన్ వెయ్యి కళ్లతో కాపలా కాస్తాడు కాబట్టి కంప్యూటర్ కోడ్ నంబర్ల ఆధారంగా ఎమ్మెల్యేలను భయపెట్టే అవకాశం కన్పించడం లేదు. తన ఎమ్మెల్యేల క్రాస్ ఓటింగ్ ఆరవ అభ్యర్థి వరకు పరిమితమైతే ఫర్వాలేదు. అంత కంటే ముందుకు సాగి, తతిమా అభ్యర్థులకు ఎసరు పెట్టే పరిస్థితులు వస్తే తల ఎత్తుకోలేని పరాభవం తప్పదు. ఆ పరిస్థితి ఏర్పడ కుండా చూడడానికి చంద్రబాబు చాలా పకడ్బందీ వ్యూహం పన్ను తున్నారు.

ఆరవ అభ్యర్థిగా వెంకటేశ్వర రావు గెలిస్తే రేపటి పార్లమెంట్ ఎన్నికల్లో ఆయనకు రాష్ట్రమంతా తిరిగి ప్రచారం చేసే సావకాశం లభిస్తుంది. దాన్ని ఆయనకు ఇవ్వడం చంద్రబాబుకు ఇష్టం లేదు. అందువల్ల ఆ వర్గంలోని ఎమ్మెల్యేలను కొందరినైనా చీల్చడానికి పెద్ద పెద్ద ఆశలు కల్పిస్తున్నట్లు వినికిడి.

కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ వెంకట్రామి రెడ్డి ధైర్యం ఏమిటో ఎవరికి అంతు బట్టడం లేదు. కనీసం 12 ఓట్లు లేనిదే ఆయన గెలువ లేరు. బిజెపి, మజ్లిస్, స్వతంత్ర ఓట్లు వచ్చినా చాలవు. బాబు తెలుగు దేశంలోని కొందరు ఎమ్మెల్యేలతో ఆయనకు రహస్య ఒప్పందా లేమైనా వున్నాయా? లేక వెంకటేశ్వర రావును పట్టి వార్చి చేయడానికి లక్ష్మి పార్వతి లోపాయి కారీగా తన నమ్మకస్తులను అటు పంపించే ఏర్పాటేదైనా చేసిందా? ఏదో ఒక ఏర్పాటు లేకుండా వెంకట్రామి రెడ్డి ఇంత సాహసం చేస్తారా? ఒక్కొక్క ఎమ్మెల్యేకి 10 నుంచి 20 లక్షల డబ్బు ఇవ్వడానికి ఆయన రెడీ అంటున్నారు. ఆ డబ్బుకు లొంగుతున్న వారెవరు?

# రాజ్యసభలో భామా కలాపాలా?

మంతనాలు జరుపు కొన్నారు; మల్ల గుల్లాలు పడ్డారు. బాధ నష్టాలు మూట కొన్నారు - బాబుదులు పోటముల పద్మ రాముకొన్నారు. ఎట్టకేలకు తెలుగు దేశం పార్టీ అధికార పక్షం రాజ్యసభకు తమ అభ్యర్థులు ఆరు మంది పేర్లను ప్రకటించి తంతు ముగించింది. ఆ ఆరు మందిలో ఒక తారామణి. తలుక్కు మనడం విశేషం.

ఆమె టి.పి. పర్టానికి చెందటం ఒకటి; పార్టీకి - ప్రజలకు కాదు - చేసిన సేవ మరొకటి - వెరసి రెండు అర్హత లున్నట్లుగా ఆనరబుల్ ముఖ్య మంత్రి యోగ్యతా పత్రమివ్వటం మరొక విశేషం. అంతే కాని, రాజ్యసభలో కూర్చో వలసిన వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యాలతో పని లేదన్నమాట.

రాజ్యసభ పెద్దలకై ఉద్దేశించిన సమున్నత వేదిక. విజ్ఞాలను, వివేక వంతులను ఎంపిక చేసి పంపడం సమంజసం, సముచితం. పార్లమెంటరీ సంప్రదాయాల తెలివిడి లేని వాళ్లు అక్కడ ఏమి చెయ్యగలరు? దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక విషయాలలో దిట్టలు కాని వాళ్లు అక్కడ నెగ్గుకు రాలేరు. సమస్యలకు స్పందించి, చర్చలను సారవంతం చెయ్యగల చేవ ఉండాలి. లోకసభ నుంచి వచ్చిన బిల్లులోని లొసుగులను ఎత్తి చూపి, సవరణలు చెప్పగలిగే నేర్పు ఉండాలి; ఏది నెగ్గేది ఏది పోయేది సహేతుకంగా నిరూపించి నెగ్గుకు రాగలిగే వారవా పటిమ ఎంతో అవసరం.

కీ.శే. తరిమెల నాగిరెడ్డి విద్యార్థినుడు. సిద్ధాంత నిబద్ధత గల రాజకీయ దురంధరుడు. దేశ సమస్యల పట్ల చక్కని అవగాహన గల బుద్ధి కుశలుడు. చర్చా చతురుడు. రాష్ట్ర అసెంబ్లీలో తన అమోఘమైన వాగ్ధాటితో, వాద పటిమతో సభా కార్య కలాపాలను రక్తి కట్టించి సెభాష్ అనిపించుకొన్న మేరావి. అంతటి నాగిరెడ్డి పార్లమెంటులో (లోకసభ) కిం

> **తారల తలుకులతో పెద్దల సభకు వన్నె పెరగదు - చిన్నబోతూంది!**

అవలేక మిన్నకుండి పోయిన వైనం ఎల్ల వారికీ తెల్లమే. అంటే అక్కడ చర్చల సరళి అంత గంభీరంగా, గహనంగా ఉంటుం దన్నమాట.

మరి ఈ సినిమా తారల తరలింపు ఏ ఘన కార్యం సాధించేందుకు? నేడు ఎంపికై, రేపు తప్పక ఎన్నిక కానున్న ఆ తార ప్రజ్ఞా ప్రాభవాలు ఏ పాటివి? సినిమాలో వగలొలి కించడంలో జాణ కావచ్చు; గ్లిజరిన్ కన్నీటిని కాలువలకు మళ్లించి సాదా ప్రేక్షకుల హృదయ క్షేత్రాల్లో కరుణ రసాన్ని పండించనూ వచ్చు; డబుల్ మీనింగ్ డైలాగులను లాఘవంగా పల్కించి, చప్పట్లు, ఈలలు సృష్టించనూ వచ్చు; కాని రాజ్యసభ కార్య కలాపాలు భామా కలాపాలు కావే?

అప్పటికే ఒక మగ తార మగటిమి దేశం నలుమూలలా పాకి పోయింది. ఆయన్ను రాజ్యసభకు ఎగదోలుతూ అప్పటి మహా నాయకుడు 'రాష్ట్రం పేరు నిలుపు' అని దీవించి పంపినట్లు వార్త. ఉత్తర క్షణంలోనే ఆయన ఒక రోదసీ రోలంబాలిక పై (Air Hostessకు తెనుగు సేత) తన విలనీ ప్రతాపం ప్రదర్శించారని పత్రికల్లో సువార్త.

ఇది చాలదన్నట్లు - మరికొంత కాలానికి - పార్లమెంటు సభ్యుడుగా బాధ్యత గుర్తు వచ్చిందేమో - రాజ్యసభ ఛైర్మన్‌కు రౌద్ర రసాన్ని పోషిస్తూ ఆయన వ్రాసిన పరుష పద భూయిష్టమైన లేఖ వార్తల కెక్కి, వన్నె వాసి సంతరించు కొంది. మరి ఈ రౌద్ర రస ప్రధానమైన పాత్ర పోషణకు కారణం ఏమిటంటారా? అబ్బే ఏం లేదు - వడ్ల గింజలో బియ్యపు గింజ - చీలిన తెలుగు దేశం పార్టీలలో ఏలిన వారి పక్షంలో తనను చేర్చలేదని! ఎంత నేర్పు? ఎంత ఓర్పు? మరి ఈ మగ తార నిర్వాకంతో మన రాష్ట్రం పరువు ప్రతిష్ఠలు మింటి కెగసినట్లా, మట్టి గరిచినట్లా?

కొరవ 9 పేజీలో

# బ్రోకర్ల ఆత్మహత్య జాలి పడాల్సింది కాదు!

హైదరాబాదుకు చెందిన ఇద్దరు షేర్ బ్రోకర్లు స్పెక్యులేటివ్ జూదంలో సర్వం కోల్పోయి, జీవితం పై విరక్తితో ఆత్మహత్య చేసుకున్నారు. సాధారణ పరిస్థితులలో ఎవరైనా ఆత్మహత్యకు పాల్పడ్డారంటే వారి పట్ల జాలి కల్గడం, సానుభూతి చూపడం సహజం. కాని వీరు జాలికి అనర్హులు.

ఈ ఇద్దరు షేర్ బ్రోకర్లు జెడ్ టెలికాం, కెవిఆర్ టెలికాం, శ్రీ కన్యక ఇన్వెస్ట్‌మెంట్స్, వాల్యూ లైన్ సెక్యూరిటీస్, పాలిషు ఫైనాన్స్ వంటి కంపెనీల షేర్ల పై జూదం నిర్వహించారు. ఆయా కంపెనీల ప్రమోటర్ల సహకారంతో, వారితో కుమ్మక్కై ఈ బ్రోకర్లు జూదం నిర్వహించారు. ఈ మాయలో వారికి 30,40 లక్షల వరకు నష్టం వచ్చిందట. దానికి తట్టుకోలేక వారు ఆత్మ హత్యలకు పాల్పడ్డారు. అయితే వీరికి జరిగిన నష్టం కంటే చిన్న ఇన్వెస్టర్లకు జరిగిన నష్టం చాలా ఎక్కువ. దీనికి ఐదారు రెట్లు అధికంగా వుంటుందది. షేర్లను కాటన్ మార్కెట్ చీటీల కంటే హీనంగా తయారు చేసి, అమాయక ఇన్వెస్టర్లకు భ్రమలు కలిగించి, ప్రమోటర్లు కుమ్మక్కుతో వీరు నిర్వహించిన జూదంలో, దీపం ప్రమిదెలో పురుగుల వలె ఎందరో చిన్న ఇన్వెస్టర్లు మాడి మసై పోయారు. వారందరి దుర్గతి ఒకసారి ఆలోచిస్తే, అందుకు కారకులైన ఈ బ్రోకర్ల పట్ల జాలి కల్గడం లేదు. పైపెచ్చు ఆగ్రహం కల్గుతూంది. దీని కంతటికీ అసలు కారకులైన ఆయా కంపెనీల ప్రమోటర్లను శిక్షించ లేని మన చట్టాల అసమర్థత పట్ల ఆక్రోశం కల్గుతూంది. వేల మంది చిన్న ఇన్వెస్టర్లను నిలువునా ముంచి, వారి కొంపలు గుల్ల చేసి, బికారులుగా తయారు చేస్తున్న ఇటువంటి ప్రమోటర్లు, బ్రోకర్ల పట్ల ఎవరూ సానుభూతి చూప నవసరం లేదు. వీరిపైతే చట్టం ప్రకారం నేరం రుజువు చేసి కఠినంగా శిక్షించడం అవసరం.

ఈ బ్రోకర్ల ఆత్మ హత్యలతో హైదరాబాదు స్టాక్ ఎక్స్ఛేంజిలో తాత్కాలికంగా స్పెక్యులేటివ్ జూదం ఆగి పోయింది. సాధారణ వ్యాపార పరిమాణం కూడా తగ్గి పోయింది. అయితే ఈ దారుణం కొంచెం మరపుకు రాగానే ఇటువంటి ఆపరేటర్లు మళ్లీ రంగంలోకి దిగే ప్రమాదం వుంది. వారి పట్ల, వారి మాయా జూదపు పోకడల పట్ల జాగ్రత్తగా మసలడం చిన్న ఇన్వెస్టర్లకు క్షేమం.

# పెట్రోలు ధర భగ్గుమంటుందా!

పెట్రోలు ధర సమీప భవిష్యత్‌లో విపరీతంగా పెరిగి పోయే సూచనలు కన్పిస్తున్నాయి. డాలర్ ధర, కేంద్ర ప్రభుత్వ ఆర్థిక పరిస్థితులు, ఆయిల్ కంపెనీల స్థితి గతులు పరిశీలించి చూస్తే ఈ సమ్మెట పోటు జనం భరించక తప్పద న్పిస్తూంది. గత మార్చిలో బడ్జెట్ అంచనాలు రూపొందించి నప్పుడు ఆయిల్ దిగుమతులకు కేంద్రం వెచ్చించే వ్యయం రు. 21 వేల కోట్లని ప్రతిపాదించారు. కానీ ఇప్పుడు డాలర్ ధర విపరీతంగా పెరిగి పోయింది. ఈ ధరతో ఆయిల్ దిగుమతి చేయడానికి రేపటి మార్చి నాటికి 28 వేల కోట్ల రూపాయలు కావాలి. ఈ ఏడెనిమిది వేల కోట్ల అదనపు వ్యయం భరించే స్థితిలో కేంద్రం లేదు. ఆ తేడాను ప్రజల నుంచి వసూలు చేయ వలసిందే. ఇంత నష్టాన్ని పూడ్చు కోవాలంటే అర్ధ రూపాయి, ఒక్క రూపాయి ధర పెంపుదలతో అసాధ్యం. ఒక అంచనా ప్రకారం పెట్రోలు లీటరు ధర 26 లేదా 27 రూపాయలకు పెరిగినా ఆశ్చర్యం లేదంటున్నారు. అట్లే డీసల్ ధర కూడా రు. 14 నుంచి 15 ల వరకు పెరగ వచ్చు. గ్యాస్ సిలిండర్ రు. 170 లు దాటి పోతుంది.

డాక్టర్ దుర్గాప్రసాద్

రెండు పార్లమెంట్ ఎన్నికలు వున్నాయి కాబట్టి, ప్రభుత్వం ఇప్పటి కిప్పుడు పెట్రోలు ధర పెంచే సాహసం చేయ లేకున్నది. ఎన్నికల తర్వాత ఏ ప్రభుత్వం వచ్చినా ధఱ పెంచక తప్పదు. దాన్ని ఎవరూ ఆపలేరు.

## ఇన్‌కంట్యాక్స్ మినహాయింపు రద్దు?

డాలర్ ధర పెరిగి, ఎగుమతి దారుల లాభాలు అనూహితంగా పెరిగి పోవడంతో ఎగుమతి ప్రోత్సాహ కాలుగా ఇప్పటి వరకు ఇస్తున్న ఆదాయం పన్ను మినహాయింపు సౌకర్యాన్ని రద్దు చేసే ఆలోచనలో వుంది కేంద్ర ప్రభుత్వం. డాలర్ ధర రు. 31.5 నుంచి రు. 37 లకు పెరగడం వల్ల ఎగుమతి దారులకు దాదాపు 17.5 శాతం అదనపు ఆదాయం లభిస్తున్నది. మిలియన్ డాలర్ల ఎగుమతికి 55 లక్షల రూపాయల వరకు అదనపు లాభం సిద్ధిస్తున్నది. ఇది అనూహితమైన లాభం. ఇంతింత లాభార్జన చేసే వారి నుంచి ఆదాయం పన్ను దండక పోవడం అన్యాయమని కొందరు అధికార్లు వాదిస్తున్నారు. ఆర్థిక మంత్రిత్వ శాఖ సైతం ఆ కోణం నుంచే ఆలోచిస్తున్నది. ఎగుమతి దారులు డాలర్లను విదేశాలలో తొక్కి పెట్టి, రూపాయి విలువ పతనం కావడానికి పరోక్షంగా కారకు లౌతున్నారనే, కారణంతో ఆర్థిక మంత్రిత్వ శాఖ ఎగుమతి దార్ల పై చాలా కోపంగా వుంది. అందువల్లే వారికి ఇస్తున్న ఆదాయం పన్ను మినహాయింపు సౌకర్యం రద్దు చేయాలని తలపోస్తున్నారు. రేపటి బడ్జెట్‌లో దీని పై ఒక నిర్ణయం జరగవచ్చు.

> **లీటరు రు 26 లకు పెరుగుతుందని ఒక అంచనా; డీసల్ ధరా రెట్టింపు కావడం తథ్యం!**

## రిలయన్స్ గుణపాఠం

రిలయన్స్ ప్రమోటర్లను ఇబ్బంది పెట్టడానికి పని గట్టుకొని, పథకం ప్రకారం ఆ కంపెనీ షేర్‌ను రు. 160 లకు దిగజార్చిన బేర్ ఆపరేటర్లు కోలుకోలేని దెబ్బ తిన్నారు. వ్యక్తిగత విరోధంతో రెండు, మూడు నెలల పాటు వీరు కట్టిన దెబ్బలకు షేర్ ధర కుంచించుక పోతే, ఇప్పుడు వారే కృంగి పోతున్నారు. అవకాశం కోసం ఎదురు చూస్తుండిన రిలయన్స్ అనుకూలురైన ఒక వర్గం బ్రోకర్లు హఠాత్తుగా బుల్ ఆపరేటర్లుగా మారి షేర్ల కొనుగోలు ప్రారంభించడంతో బేర్ ఆపరేటర్లకు ఒకే ఒక వారంలో 250 కోట్ల రూపాయల వరకు నష్టం వచ్చింది. దాని నుంచి వారు కోలుకోవడం అసాధ్యం. ఏ కారణం లేకుండా, విరోధ భావంతో మార్కెట్‌ను దెబ్బ తీసినందుకు వారు మంచి గుణపాఠమే అనుభవించారు.

నేషనల్ స్టాక్ ఎక్స్ఛేంజిలో ఇప్పుడు రిలయన్స్ కంపెనీ హాట్ ఫేవరెట్‌గా మారింది. మొన్నొక రోజు ఈ ఎక్స్ఛేంజిలో రు. 1500 కోట్ల వ్యాపారం జరిగితే, అందులో రిలయన్స్ కంపెనీ షేర్ల లావా దేవీల పరిమాణం వెయ్యి కోట్లు.

# విదేశీ ధనం వూపిరి పోసింది!

బొంబాయి స్టాక్ ఇండెక్స్ 3500 స్థాయికి చేరింది; కొన ప్రాణంతో కొట్టుక లాడుతుండిన షేర్ మార్కెట్‌కు మళ్లీ ప్రాణ వాయువు అందింది. విదేశీ ఇన్వెస్టర్లు, పెట్టుబడి సంస్థలు ఉత్సాహంగా కొనుగోళ్లు ప్రారంభించడమే దీనికి కారణం. స్టేట్ బ్యాంకు, రిలయన్స్, టిస్కో, బిఎస్ఇఎస్, టాటా పవర్స్ హోలా లీల తదితర కంపెనీల షేర్లు బాగా ట్రేడ్ అవుతున్నాయి. అమెరికా బ్యాంకులలో డిపాజిట్ల మీద వడ్డీ రేట్లు తగ్గి పోవడం; ఆ మార్కెట్లలో షేర్ల ధరలు పెరుగు తుండడంతో విదేశీ ఇన్వెస్టర్లు ఇండియా వైపు మళ్లు తున్నారు. ఆర్థిక స్థిరత్వం కల్గిన పెద్ద కంపెనీల ఫండ మెంటల్స్ పరిశీలిస్తే ఇప్పుడు మార్కెట్‌లో వాటికి వున్న షేర్ ధరలు చాలా చవక క్రింద లెక్క. అందువల్లే, వీరు అంతగా మన మార్కెట్ వైపు ఆకర్షితు లౌతున్నారు.

అయితే విచిత్ర మేమిటంటే హవాలా కుంభ కోణంలో పలువురు కేంద్ర మంత్రులతో పాటు పెద్ద సంఖ్యలో రాజకీయ వాదులు, అధికార్లు ఇరుక్కో వడం; క్రిమినల్ నేరాలతో ఇద్దరు మాజీ కేంద్ర మంత్రులు బెయిల్ కూడా దొరకక జైలు పాలు కావడం, షివి

కొరవ 6 పేజీలో

# సరిహద్దుల కావలే డాలర్లు నిలిపేస్తున్నారు!

డాలర్ ధర పెరిగి పోవడంతో స్వదేశీ ఎగుమతి దారులు తమకు రావలసిన విదేశీ మారక ద్రవ్యాన్ని ఇతర దేశాలలో తొక్కి పారేస్తున్నారు. తమ ఎగుమతులకు ప్రతిఫలంగా రావలసిన డబ్బును డాలర్ల రూపంలో దేశం లోపలికి తెచ్చేస్తే, పెరిగే డాలర్ ధర ప్రయోజనం సిద్ధించదని వీరి ఉద్దేశ్యం. రిజర్వు బ్యాంకు దేశంలోకి వచ్చే డాలర్లను ఏ రోజుకారోజు రేటు పద్ధతిన తాను తీసుకొని, ఎగుమతి దారులకు రూపాయలు చెల్లిం చేస్తుంటుంది. అందువల్ల డాలర్ ధర బాగా పెరిగి, ఇక ఆగుతుంది అనుకునే దశలో వాటిని స్వదేశం లోకి తీసుక రావాలని ఎగుమతి దారులు సంకల్పించడంతో వేల కోట్ల రూపాయల విలువైన డాలర్ల సొమ్ము విదేశీ బ్యాంకులలో మురిగి పోతున్నది. ఇట్లా తొక్కి పట్టిన మొత్తం విలువ 7500 కోట్లకు పైనే వుంటుందని ఒక అంచనా. డాలర్ ధర పెరిగి, కృత్రిమ కొరత ఏర్పడడానికి ఇదీ ఒక కారణమే.

వజ్రాలు, బంగారు నగలు, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్, రెడీ మేడ్ వస్త్రాలు తదితరాలను ఎగుమతి చేసే వారు ప్రధానంగా ఈ పనికి పాల్పడు తున్నారు.

# నిషేధం అవసరమా

ఓట్ల కోసం, ఎన్నికల నాటి అవసరాల కోసం రాజకీయ నాయకులు అవధ్యంగా ప్రకటించే నిర్ణయాలు ఆ తర్వాత రాష్ట్రం మనుగడకు ఎంతటి భారంగా పరిణమిస్తున్నాయో తెలుసు కోవడానికి మద్య నిషేధం సజీవ నిదర్శనంగా నిల్చి పోతుంది.

నెల్లూరు జిల్లాలో సారాకు వ్యతిరేకంగా మొదలైన మహిళా ఉద్యమం నుంచి ఓట్లు పండించు కోవడానికి కాంగ్రెస్, తెలుగు దేశం పార్టీలు రెండూ పోటీలు పడి శాసన సభ ఎన్నికల సమయంలో సంపూర్ణ మద్య నిషేధ నినాదాన్ని పలవరించాయి. ఆ వేడిలో, ఆ ఉద్రేకంలో, ఆ ఎన్నికల ఆరాటంలో ఎవరూ సాధ్యా సాధ్యాలు ఆలోచించలేదు; సాంఘిక, ఆర్థిక, పాలనాపర సమస్యలు పరిగణించ లేదు! మానవ జాతి నాగరికత నేర్చిన నాటి నుంచి తరాల పాటు, యుగాల పాటు నిరంత రాయంగా కొనసాగుతున్న ఒక దుర్వ్యసనాన్ని చట్టాలతో, శాసనాలతో అదృశ్యం చేసేయ వచ్చుని భావించారు; ఒకే ఒక కలం పోటుతో మద్య మహమ్మారిని శాశ్వతంగా హత మార్చినట్లు భ్రమింప జేశారు కూడా రామారావు గారు!

ఇప్పుడేమైంది - నిషేధం కేవలం కాగితాలకు పరిమిత మైంది; మద్యం మాత్రం రాష్ట్ర మంతా ఏరులై పారుతూంది. పన్నుల ఆదాయం లేక ఖజానా వట్టి పోయింది; కోట్ల కోట్ల వ్యాపారం మాత్రం స్మగ్లర్లకు భూలోక స్వర్గాలు నిర్మించి ఇస్తూంది! మత్తు కల్లు పేరుతో కల్తీ కల్లు, సరిహద్దులు దాటి వచ్చే విస్కీ బ్రాందీలు, ఇతర రాష్ట్రాల సారాయి పొట్లాలు, స్వరాష్ట్రపు నాటు సారా క్యాన్లు గ్రామ గ్రామంలో, ప్రతి పట్టణంలో, చివరకు రాజధాని నగరంలో యధేచ్ఛగా, నిరాటంకంగా ప్రవహిస్తూనే వున్నాయి. త్రాగుడు వ్యసనానికి బానిసలైన వారు ఆ చెర నుంచి ఏ మాత్రం విముక్తులు కాలేదు; పైపెచ్చు కల్తీ సరుకుకు బలై పోతున్నారు; తమ సంపాదన యావత్తూ ధార పోస్తున్నారు.

అది సారా కాని, బ్రాందీ కాని దొరకని వూరు లేదనడం నిజం; ఇది వరకు రూపాయితో సరిపోయేది. ఇప్పుడు నాలుగు రూపాయలు ఖర్చు అవుతున్నది - అంతే! ఎక్సైజ్ అధికారులు, పోలీసులు ఎంత గట్టి కాపలా కాస్తున్నట్లు నటించినా, పట్టుబడిన సీసాలు పగలగొట్టే సన్నివేశాలు ఎన్ని సృష్టించినా రాష్ట్రంలో విస్కీ, సారాలు, నిరంత రాయంగా ప్రవహిస్తు న్నాయనదం నిజం. పట్టుబడేవి ఒక శాతం కూడా లేవన్నది వాస్తవం. మహిళా చైతన్యం, ఉద్యమ స్ఫూర్తి కల్గిన నెల్లూరు జిల్లాలో ఈ స్మగ్లింగ్ కార్య కలాపం చాప క్రింద నీరు వలె గుంభనంగా వుంది కాని, ఇటు కోస్తాకు, అటు తెలంగాణా జిల్లాలకు వెళ్తే అంతా బహిరంగ రహస్యమే. జేబులో డబ్బులుంటే మందుకు దిగులే లేదు. ఇది వరకు అంగడి ఎక్కడుందో వెతికి వెళ్లాల్సి వచ్చేది - ఇప్పుడు అంగడే మందు ప్రియుల ఇళ్లకు నడిచి వస్తూంది. కల్లు వ్యవహారం మరీ ప్రమాద కరం. మత్తు కల్లు పేరుతో క్లోరల్ డిహైడ్రేట్ వంటి విషపూరిత రసాయనాలు కలిపిన మత్తు పానీయం సర్వత్రా లభ్యమౌ తున్నది. గీత కార్మికుల మాటున నాటు సారా నిపుణులు ఈ కల్లు సరఫరాను మూడు చెట్లు, ఆరు ముంతలుగా విలసిల్ల జేస్తున్నారు. కల్లు గీసుకోవడానికి అనుమతిస్తే ఒక్కొక్క టెంకాయ చెట్టుకు ఏడాదికి వెయ్యి నుంచి, రెండు వేల రూపాయల ధర చెల్లించ డానికి సిద్ధ పడుతున్నా రంటే ఇక ఈ వ్యాపారం ఎంత జోరుగా వుందో అర్థం చేసుకోవచ్చు. ఈ మత్తు కల్లు త్రాగుబోతుల శరీరాలను స్లో పాయిజన్ వలె విష పూరితం చేస్తున్నది. పందలు ఖర్చు పెట్టి విస్కీ సీసాలు కొనే స్తోమత లేక మధ్య తరగతి కుటుంబీకులు కూడా ఎవరిగా లభించే మత్తు కల్లును ఆశ్రయి స్తున్నారు; ఆరోగ్యం చెడ గొట్టు కొంటున్నారు. అక్కడొకటి, ఇక్కడొకటి చావులూ సంభవి స్తున్నాయి. కాని అలజడి రేగకుండా వాటిని

జమీన్‌రైతు

...హజ ...మరణాలుగా చిత్రీకరించి, ...మాయ చేసేస్తున్నారు.

ఈ పరిస్థితులలో ఎందుకీ మద్య నిషేధం? ఎవరికి వుపయోగ పడుతున్నదిది? గవర్నర్ గారి మహోదాత్త ప్రసంగాలకు, ముఖ్య మంత్రి గారి మహా గొప్ప ప్రకటనలకు తప్ప మరి దేనికీ కొరగాని మద్య నిషేధం పై పునరాలోచన, పునః పరిశీలన అవసరం. ఆచరణలో విఫలమౌ తున్నదని తెలిసీ, అదుపు చేయలేని నిస్సహాయతతో, అసత్య ప్రచారాలతో ఆత్మ వంచన చేసుకొనే కంటె నిజాన్ని నిర్భయంగా ఒప్పుకొని, ఆచరణాత్మ కమైన మద్య వ్యసన నిరోధ పథకాలను, కార్యాచరణ ప్రణాళికను రూపొం దించడం అవసరం. ప్రభుత్వమేమో సంపూర్ణ మద్య నిషేధపు కలల్లో తేలియాడు తుంటే, ప్రజలు స్మగ్లింగ్ సారా, విస్కీలలో మునిగి తేలడం వల్ల ఎవరికీ ప్రయోజనం కలుగదు. చుట్టూరా వుండే రాష్ట్రాలు మద్య వ్యాపారం చేస్తున్నప్పుడు, మనం మాత్రం నిషేధం అంటే జరగదు. ఆదర్శాలు వల్లించడం వేరు, ఆచరణ జరిపించడం వేరు.

రేణుకా చౌదరి చెప్పినట్లు సారా వరకు నిషేధించి, విస్కీ బ్రాందీలను కట్టు దిట్టాలలో పడిలేయడమో; లేక పరిమిత పరిధిలో, పర్మిట్ల వంటి విధానాల ద్వారా త్రాగుడుకు బానిసలైన వారి వరకు మద్యం అందుబాటులోకి తేవడమో, లేక అటువంటి మార్గం మరొకటి అన్వేషించో మద్య నిషేధ నిర్ణయాన్ని పునః సమీక్షించడం అవసరం. లేకుంటే ప్రభుత్వం దివాలా తీస్తూనే వుంటుంది; మద్యం ప్రవహిస్తూ వుంటుంది. జనం రెంటికీ చెడిన రేవడు లౌతుంటారు.

---

జమీన్‌రైతు

15.2.1946

సం: 0-1-6 సంచిక:8

## తిరుగుబాటే తారకం

### క్షుదార్తులకు నెహ్రూ మంత్రోపదేశం

"తిరిగి కరువస్తే, ఆకలి మంటలకు మిడతల వలె మలమల మాడి పోవడానికి ఈసారి ప్రజలు సమ్మతించ బోరని గుర్తించ వలసిందిగా నేను బ్రిటీష్ ప్రభుత్వాన్ని హెచ్చరించ గోరుతున్నాను. ఈ రాష్ట్రంలో క్షామం వస్తే ప్రభుత్వం పై తిరుగుబాటు చేయ వలసినదిగా నేను ప్రజలను కోర బోతున్నానని ఇప్పుడే స్పష్ట పరుస్తున్నాను"

## నెల్లూరుముచ్చట్లు

### కరవు

జిల్లా పరిస్థితులు తారు మారుగా మున్నవి. యీ జిల్లా నుండి ఒక్క గింజైనా బైటకు పోకుండా చేసి, బైట నుండి గట్టి గింజలు దిగుమతి చేస్తే తప్ప ప్రజలు చాలా మంది కూడు లేక చస్తారు. పరిస్థితులు యింత అధ్వాన్నంగా వుంటే యీనాడు గూడ బియ్యం యింకా యితర చోట్లకు ఎగుమతి కొతున్నవంటే అధికారులు ఎంత బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నారో చూడండి.

ప్రజలు భూనభోంత రాళాలు బద్దలయ్యేట్లు గగ్గోలు పెట్టి ముందు బియ్యం ఎగుమతి ఆపి, యింకా అవసర ధాన్యాన్ని బైట నుండి రప్పించు కోవలె.

### ఎలక్షన్

ఆంధ్రా పార్లమెంటరీ బోర్డు వారి సెలక్షన్ సవ్యంగా వున్నదని చెప్పడం లేదు గాని ఒక నిర్ణయం అయిన తర్వాత క్రమశిక్షణకు బద్ధ పడవద్దా? అక్రమం జరిగిం దనుకున్నా వారు సవ్యమైన పంథాలో నడవాలె గాని ఎదురు తిరగడం యేమీ భావ్యం గాలేదు. సెంట్రల్ పార్లమెంటరీ బోర్డుకు అపీలు చేయడం, పరిస్థితులు ఎరుక పరచడం, వారి తీర్మానానికి బద్ధ పడడం కాంగ్రెసు వారు, గాంధీ

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

శిష్యులు, త్యాగ ధనులు అనుకున్న వారి లక్షణం - హనుమా రెడ్డి, లక్ష్మయ్య గారల చర్యలు ఏ మాత్రం బాగాలేవు. కాంగ్రెసు అభ్యర్థుల మీద పోటీ వేయించడానికి అందరి చుట్టూ తిరుగు తున్నారు, బ్రతిమాలు తున్నారు, బహిరంగంగా ప్రచారం చేస్తున్నారు. గోపాలు రెడ్డి గారి మీద పోటీ చేస్తున్న అక్కరాజాను ప్రోత్సహిస్తున్నారు, మాటి మాటికి ఆయన చుట్టు తిరుగు తున్నారు. గూడూరు డివిజన్ కాంగ్రెసు అభ్యర్థికి మరికొన్ని పోటీ వేయించమని వెంక టగిరి వారితో హనుమా రెడ్డి చెప్పి నాడు. గోపాలు రెడ్డి గారికి పోటీగా

కొరవరివ పేజీలో

---

# మైపాడు బీచ్‌కు ఎన్టీఆర్ పేరు పెడితే సహించం!

రాష్ట్ర మార్కెటింగ్ శాఖ మాత్యులు రమేష్ రెడ్డి, సర్వేపల్లి శాసన సభ్యుడు సోమిరెడ్డి చంద్ర మోహన్ రెడ్డితో కలిసి 12 తేది మైపాడు బీచ్‌ను సందర్శించారు. ఈ బీచ్‌ను సుందర నందన వనం చేసి ఎన్టీఆర్ స్మారకార్థం ఆ బీచ్‌కు ఎన్టీఆర్ బీచ్‌గా పేరు మారుస్తామని ప్రకటించారు. మైపాడు బీచ్‌ని అభివృద్ధి చేసే కార్యక్రమం సంతోషించ తగినదే. కానీ ఎన్టీఆర్ బీచ్‌గా నామ కరణం చేస్తామనడం అనుచితంగా వుంది. మైపాడు స్వాతంత్ర్య పోరాటపు రోజుల నుండి చరిత్ర గలిగిన గ్రామం. జాతిపిత మహాత్మా గాంధీ, మాజీ రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ వంటి మహనీయులు సందర్శించిన గ్రామం. ఉప్పు సత్యా గ్రహంలో స్వాతంత్ర్య సమర వీరులు అత్యధికులు పాల్గొన్న పవిత్ర స్థలం ఆ బీచ్. ఈ పోరాటానికి గుర్తుకుగా బలగం వెంగళ రావు పిసిసి అధ్యక్షుడిగా వున్నప్పుడు, డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి నాయకత్వంలో నెల్లూరు నుండి అనేక వేల మందితో పాద యాత్ర జరిపి ఆనాటి పోరాటాలకు గుర్తుగా ఒక స్మారక స్థూపం కూడా ఆవిష్కరించారు. ఈ విధమైన గత చరిత్ర కలిగి, కాంగ్రెస్ సంస్కృతి, సౌరభాలు వెదజల్లిన ఆ బీచ్‌కు ఎన్టీఆర్ పేరు పెట్టడం ధర్మంగా లేదు. ఎన్టీఆర్ బ్రతికున్న రోజుల్లో ఒక్కసారి కూడా ఆ గ్రామాన్ని సందర్శించిన పాపాన పోలేదు. ఆ గ్రామం గూర్చి కూడా ఆయనకు తెలియదు. మైపాడు గ్రామం పట్నం కుటుంబీకులు, స్వర్గీయ దువ్వూరు బలరామి రెడ్డి వంటి స్వాతంత్ర్య సమర యోధులకు జన్మనిచ్చిన గ్రామం. గ్రామంలో ప్రజల మనోభి ప్రాయం గాని, పంచాయితీ ఆమోద తీర్మానం గానీ లేకుండా బాబు తెలుగు దేశం నాయకులు మైపాడును తమ జాగీరుగా

**జనవాణి**

భావించి ఇష్ట మొచ్చిన రీతిలో పేర్లు మారుస్తా మనడం సబబుగా లేదు. రామారావు బొమ్మతో గత శాసన సభ ఎన్నికల్లో గెలిచిన చంద్ర మోహన రెడ్డి, మంత్రి రమేష్ రెడ్డి లిర్వురూ నయవంచకులుగా మారి ఎన్టీఆర్ ప్రభుత్వాన్ని కుప్ప కూల్చారు. చేసిన పాపం పోగొట్టుకొనే కార్యక్రమంలో భాగంగా ఎన్టీఆర్ పై కపట ప్రేమను ఒలక బోస్తూ మళ్లీ ఆయన పేరు వాడుకొని లబ్ధి పొందాలని ఏదేదో చేయాలని మారడం ప్రజలు గమనిస్తూనే వున్నారు.

నెల్లూరు -సి.వి. శేషారెడ్డి (మాజీ ఎమ్మెల్యే)

### ఆర్టీవో నిద్రపోతున్నారా?

నెల్లూరు ప్రైవేట్ బస్సుల్లో ప్రయాణికుల పట్ల సిబ్బంది ఆగడాలు రోజు రోజుకూ పెరిగి పోతున్నాయి. చాలా బస్సుల్లో ఓవర్ లోడు చేసి, స్త్రీ, పురుష భేదం లేకుండా ప్రయాణికులను సినిమా హాళ్ల బుకింగుల వద్ద నెట్టినట్లు నెట్టుతుంటారు. వివిధ స్టాపింగులకు టిక్కెట్ల రేట్లు నిర్ణయించే బోర్డులు బస్సుల్లో సక్రమంగా వుండవు. టిక్కెట్లను ఇవ్వ కుండానే డబ్బులు గుంజేస్తున్నారు. ఇటీవల ఒక బాలికను టౌన్ బస్ ఢీ కొన్న సంఘటనలో ప్రజలు ఆగ్రహం ప్రదర్శించి బస్సును తగలబెట్టినా బస్సుల యాజమాన్యాలకు బుద్ధి రాలేదు. విసుగు కల్గించేలా స్టాపింగుల్లో ఓవర్ లోడు చేసే వరకు కాలయాపన చేస్తూ ఆపి వేయడం; తరువాత స్పీడు లిమిట్స్ పాటించక ఉరుకులు పరుగులు తీయించడం సర్వ

మిగతా 9 పేజీలో

# "మునిసిపల్ ముళ్ల కిరీటం మళ్లీ నాకు వద్దు బాబోయ్!"

మునిసిపాలిటీలో మెజార్టీ కౌన్సిలర్లకు ప్రజా సమస్యల పట్ల ఆసక్తి లేదన్న విషయం 12 తేది జరిగిన మునిసిపల్ అత్యవసర సమావేశంలో మరోసారి వెల్లడైంది. అజెండాలో చర్చకు పెట్టిన 204 అంశాల్లో పెండింగులో పడిపోయి వున్న విజయ్ మహల్ బాక్స్ డ్రైను బ్రిడ్జి, చింతారెడ్డి పాళెం కంపోస్టు యార్డు తరలింపు, మునిసిపల్ పరిధిలోని మార్కెట్లలో, పాఫుల లీజులకు తిరిగి వేలం పాటలు నిర్వహించాల్సిన అత్యవసర విషయాలు చర్చించాల్సి వుంది. కాని సమావేశానికి ముందే మీటింగు హాలులోకి రాబోతున్న మునిసిపల్ కమీషనర్‌ను మాగుంట వర్గీయులుగా చెప్పుకొంటున్న కౌన్సిలర్లు ఘెరావ్ చేశారు. తమ వార్డుల్లో పనులకు కమీషనర్ టెండర్లు పిలవడం లేదనేది వీరి వాదన. ఛైర్మన్ వివేకానంద రెడ్డి జోక్యంతో ఈ ప్రహసనం ముగియగానే ఆ వర్గం కౌన్సిలర్లు పత్రికల వారి వద్దకు వచ్చి ఘెరావ్ చేసిన వారి పేర్ల లిస్టు చెప్పుకొన్నారు.

అనంతరం మొదలైన సమావేశంలో సెలవు దినాల్లో అజెండా పంపడ మేమిటని జంటి పెండెంట్ సభ్యుడు సుబ్బారావు ప్రశ్నించారు. అజెండా కాపీ పై తేది కూడా లేదని, రెండవ శనివారం రోజు పంపడ మేమిటని మరో కౌన్సిలర్ దాట్ల నరసింహ రావు అడిగారు. తెలుగు దేశం ప్రాంతీయ సదస్సుకు పోయే వుత్సాహంతో ఆ పార్టీ కౌన్సిలర్లు కూడా

### నెల్లూరు సంగతులు

అజెండా తప్పుగా పంపడ మేమిటి- సమావేశం వాయిదా వేయమన్నారు. అజెండాలో తొందర పాటు, పొరపాట్లు ఇక నుండి జరగవని; సమావేశం వాయిదా అనే అనవసర పట్టుదల ఎందుకని ఛైర్మన్ నచ్చ చెప్ప చూసినా ఎవరూ వినలేదు. సమావేశం అర్ధరాత్రి వరకు జరిగి తీరుతుందని బిస్కెట్లు, కేకులు, పులిహోర, పొంగలి తయారు చేయించానని వీటిని తిని వెళ్లండని వివేకానంద రెడ్డి కౌన్సిలర్లకు విన్నవించి పోన్న ధోరణిలో వారిని నిలువరించాలని చూసినా ఏదో కొంపలు మునిగి పోతున్నట్లు కొందరు సభ్యులందరూ సమావేశం హాలు నుండి లేచారు. సభ్యులకు ఇటువంటి ధోరణి తగదని సిపిఎం పక్ష నాయకుడు మాదాల వెంకటేశ్వర్లు రుసరుస లాడడం కనిపించింది. సాయంత్రం ప్రారంభమైన సమావేశాలు అర్ధరాత్రి వరకు జరగడం వల్ల ఇంటికి పోను, ఇబ్బందిగా వుందని సమావేశాల సమయం మార్చమని 27 వార్డు కౌన్సిలర్ మాచినేని అరుణ కుమారి కోరారు. సభ్యులు అర్థ పర్థం లేని వాదనలకు దిగుతుండడంతో వివేకానంద రెడ్డి ఒక ప్రతిపాదన చేశారు. తనకు ఛైర్మన్‌గా మిగిలిన పదవి కాలాన్ని 44 వార్డు కౌన్సిలర్లకు పంచితే ఒక్కొక్కరికి ఎంతెంత కాలం వస్తుందో నిర్ణయించి, ఆ కాలంలో వారిని మునిసిపల్ కుర్చీలో కూర్చో పెట్టాలని తల పోస్తున్నట్లు చెప్పారు. ఛైర్మన్

కొంత 8 పేజిలో

శ్రీ కృష్ణదేవరాయ జయంతి సభలో వక్త డాక్టర్ రామచంద్రను సన్మానిస్తున్న ఆలిండియా రేడియో విజయవాడ స్టేషన్ డైరక్టర్ డాక్టర్ ఆర్. పద్మనాభ రావు, చల్లగుండ్ల రామచంద్రయ్య, వర్ధమాన సమాజం అధ్యక్ష కార్యదర్శులు పి.వి. రమణా రెడ్డి, బి.వి. నరసింహం

# రాయల సాహితీ తీరుకు ఎలిజబెత్ రాణి సేవకు దగ్గరి పోలికలున్నాయి!

నెల్లూరు వర్ధమాన సమాజ యాజమాన్యాన శ్రీకృష్ణ దేవరాయ జయంతి సభ 9 తేది టౌనుహాలులో జరిగింది. మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ వి. రామచంద్ర శ్రీకృష్ణ దేవరాయల కవితా వైభవం పై చక్కనైన ఉపన్యాసం ఇచ్చారు. కవితా ప్రావీణ్య ఫణీశుడు కృష్ణ దేవరాయలు ఆముక్త మాల్యదలో సర్వే సర్వత్ర వైష్ణవ ప్రతిపత్తిని అందంగా ప్రతిపాదించారు. త్రికరణ శుద్ధిగా భగవంతుని సేవించిన భక్తుడు ఏ రంగానికి చెందిన వాడైనా ముక్తి పొందుతాడు. రాయల సాహిత్య సేవ ఎలిజబెత్ మహారాణి సాహిత్య సేవను తలపుకు తెస్తుంది. స్వయంగా కవియైన రాయలు తన కవిత్వాన్ని ఎక్కడా ప్రశంసించు కోలేదు. తన ఆస్థానంలోని కవుల కవితను నిష్పక్ష పాత బుద్ధితో కొనియాడారు. రాయల సాహిత్య దృష్టి సామాన్యమైంది కాదు. స్వయంగా సార్వభౌముడైన రాయలు సమాజంలోని సామాన్య విషయాలను సూక్ష్మంగా పరిశీలించి పది కాలాల పాటు పచ్చగా వుండే కవిత్వం చెప్పారు. ఆముక్త మాల్యదలోని వర్ణనలలో ప్రతి పద్యంలోను అంతః స్రోతస్విని వలె వైష్ణవ భక్తి ప్రతిబింబిం చిందని వివరించి ముగించారు. సభకు అధ్యక్షత వహించిన ఆకాశవాణి విజయ వాడ కేంద్రం డైరక్టర్ రేపూరి అనంత పద్మనాభ రావు రాయలు ప్రకృతి పరిశీలనా ప్రవీణుడని శ్లాఘించారు. సభా

పోషకులు చల్లగుండ్ల రామచంద్రయ్య తమ జననీ జనకుల స్మృత్యంకంగా డాక్టర్ వి. రామచంద్రను సన్మానించారు. వర్ధమాన సమాజం అధ్యక్షులు న్యాయవాది పి.వి. రమణా రెడ్డి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. సమాజ కార్యదర్శి బి.వి. నరసింహం ఆహ్వాన, వందన సమర్పణలతో సభ ముగిసింది.

# నెల్లూరులో మరికొన్ని మహిళా వుద్యమాలు వూపిరి పోసుకోవాలి!

ప్రభుత్వం మహిళా భివృద్ధి కోసం చేసిన చట్టాలను వివిధ కారణాల చేత మహిళలు ఉపయోగించు కోవడం లేదని సంఘ సేవకురాలు మల్లాది సుబ్బమ్మ అభిప్రాయ పడ్డారు. 8 తేది దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో జరిగిన మహిళా సదస్సుకు ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. ఉద్యోగాలలో స్త్రీలకు 30 శాతం రిజర్వేషన్, ఎన్నికల్లో ప్రాధాన్యత, మహిళా యూనివర్సిటీ, న్యాయ స్థానాలు, ప్రత్యేక పోలీస్ స్టేషన్లు ఏర్పాటు చేసి వున్నారు. ఎన్టీ రామారావు ముఖ్య

### మహిళా సదస్సులో వాసిరెడ్డి అభిలాష!

మంత్రిగా వున్నప్పుడు పుట్టుకతో ఆడ పిల్లకు ఆస్తి హక్కు కల్పిస్తూ చట్టం చేశారు. కాని అప్పటి నుంచి ఇప్పటి వరకు ఆ చట్టాన్ని ఉపయోగించు కొన్న దాఖలాలు లేవని ఆమె చెప్పారు. ఇంటిలోని కుటుంబ సభ్యుల బెదిరింపులతో పాటు, భర్తకు లొంగి హక్కుల కోసం పోరాటం చేయడం లేదని అందువల్లే చట్టాలు నిరుపయోగం అవుతున్నాయని అభిప్రాయ పడ్డారు. సమాజంలో అణగదొక్క బడుతున్న స్త్రీలు అభివృద్ధి చెందాలంటే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అవసరమని నొక్కి చెప్పారు. పురుషులకు 58 ఏళ్లకు రిటైర్‌మెంట్ వుంది. తరువాత పింఛన్‌తో ఇంట్లో ఆడ వారి పై పెత్తనం చెలాయిస్తూ కాలం గడుపుతారు. అదే స్త్రీ అయితే 6 సంవత్సరాలు మొదలు 90 ఏళ్ల వరకు పని చేయవలసి వస్తున్నదని సుబ్బమ్మ విశ్లేషించారు. రచయిత్రి వాసిరెడ్డి కాశీరత్నం మాట్లాడుతూ వుద్యమాలకు పుట్టినిల్లైన నెల్లూరులో మరికొన్ని స్త్రీల వుద్యమాలు ఊపిరి పోసుకోవాలని అభిలషించారు. జిల్లా పొదుపు లక్ష్మి అధికారిణి కె.ఎల్. కుసుమ కుమారి జిల్లాలో ఇప్పటి వరకు 9 కోట్ల రూపాయలు మహిళలు పొదుపు చేసినట్లు చెప్పారు. హైదరాబాద్‌లోని మహిళా వికాస దర్శిని సంస్థ అధ్యక్షురాలు రేవతి తదితరులు ఈ సదస్సులో ప్రసంగించారు.

### పన్ను వసూళ్లకు పక్కా వ్యూహం!

మునిసిపల్ కమీషనర్ కె. ఆంజనేయులు మూడు నెలల్లో రిటైర్ అయి పోతున్నా, మునిసి పాలిటీ ఆర్థిక పరిపుష్టి కోసం నడుం కట్టారు. దీని కోసం పన్ను వసూళ్లను వేగిర పరిచారు మున్సిపల్ రెవిన్యూ అధికారి ఆధ్వర్యంలో ఐదు ప్రత్యేక స్క్వాడులను ఏర్పాటు చేశారు. ఒక్కొక్క స్క్వాడులో మునిసిపల్ రెవిన్యూ ఇన్స్‌పెక్టర్, ఇరువురు బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్లు, ఇరువురు సీనియర్ అసిస్టెంట్లు, ఇరువురు [illegible] లైను ఫిట్టర్లు, సంబంధిత బిల్లు కలెక్టరు వుంటారని చెప్పారు. [illegible] సభ్యులకు ఆస్తులు జప్తు చేసేందుకు కొళాయి కనెక్షన్లు తొలగించేందుకు [illegible] అధికారాలు ఇచ్చారట. ఫిబ్రవరి 29 తేది నాటికి 85 శాతాన్ని వసూలు చేసి, మిగిలిన 15 శాతం [illegible] మార్చి 31 తేది లోగా [illegible] లక్ష్యంగా పెట్టు కొన్నారట. పన్నులు సకాలంలో వసూలు చేయలేదనే నెపంతో ప్రభుత్వం మునిసి పాలిటీకి కేటాయించే కోట్లాది రూపాయల గ్రాంటు మంజూరు కాకుండా పోయే ప్రమాదం వుందని కమీషనర్ వాపోతున్నారు. ప్రజలు కూడా సహక రించాలని కోరు తున్నారాయన.

# ఆడవాళ్లకొక బ్యాంకు- అడిగినన్ని అప్పులు!

వసుంధర మహిళా వికాస్ పరస్పర సహకార సంస్థ లిమిటెడ్ నెల్లూరు శాఖను ప్రముఖ సంఘ సేవకురాలు మల్లాది సుబ్బమ్మ 8 తేది ఉస్మాన్ సాహెబ్ పేటలోని రామ్‌నగర్‌లో ప్రారంభించారు. ఈ బ్యాంకు సహకార రంగం యాక్ట్ క్రింద పని చేస్తుంది. ఇప్పటి వరకు హైదరాబాద్‌లో మాత్రమే ఇటువంటి బ్యాంకు వుంది. ఐదుగురు సభ్యులు గ్రూపుగా ఏర్పడి సంస్థలో ఖాతాదారులుగా చేరవచ్చు. ఆర్.డి., [illegible] డిపాజిట్ల పై బ్యాంకుల కన్నా [illegible] రెండు శాతం అధిక వడ్డీ [illegible] డిపాజిట్లు మొత్తం పై [illegible] వారు కట్టిన డిపాజిట్ల మొత్తానికి ఐదు రెట్ల మొత్తం రుణాలుగా ఇవ్వనున్నారు. స్త్రీలలో సహకార స్ఫూర్తి, స్వయం ఉపాధికి అవసరమైన సాంకేతిక శిక్షణ, పెట్టుబడి సమకూర్చడం సంస్థ ఆశయమని బ్యాంకును హైదరాబాద్‌లో నిర్వహిస్తున్న వికాస దర్శిని కార్యదర్శి రామ్మోహన శర్మ వివరించారు. భవిష్యత్తులో నెల్లూరు జిల్లాలో పాలసీ

### నెల్లూరు లేడీస్‌కు లక్కీ ఛాన్సు!

కరణ, మహిళా సూపర్ మార్కెట్లు నెలకొల్పడానికి కూడా ప్రయత్ని స్తున్నామని ఆమె చెప్పారు. ఈ కార్యక్రమంలో జిల్లా అడిషనల్ మేజిస్ట్రేట్ స్వర్ణలత జ్యోతి ప్రజ్వలనం, జిల్లా ఫోరం సభ్యురాలు ఇ. నీరజ పూజా కార్యక్రమం నిర్వహించారు. జిల్లా రెవిన్యూ అధికారి పి.ఎస్. రామచంద్ర షేర్ క్యాపిటల్, ఫిక్సెడ్ డిపాజిట్ల బాండ్లు, పొదుపు పాస్ పుస్తకాలను విడుదల చేసారు. వసుంధర మహిళా వికాస సంస్థ అధ్యక్షురాలు రేవతి శేఖర్, డైరక్టర్ శైలజా రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### టీచర్ పోస్టులకు దరఖాస్తులు!

మార్చిలో జరుగుతున్న టీచర్ రిక్రూట్ మెంటు పరీక్షలకు హాజరయ్యేందుకు 8193 మంది అభ్యర్థులు దరఖాస్తు చేసారు. సెకండరీ గ్రేడ్ తెలుగు ఉపాధ్యాయుల పోస్టులకు 4009, ఉర్దూకు 81 మంది, స్కూల్ అసిస్టెంట్ పరీక్షకు 1887, హిందీ [illegible] 136, పి.ఇ.టి. పోస్టులకు 283 అభ్యర్థులు హాజరవుతారు. వీరందరికీ టౌనులోని 9 సెంటర్లలో పరీక్షలు నిర్వహిస్తారు. జిల్లాలో 740 ఉపాధ్యాయ పోస్టులు ఖాళీగా వున్నాయి.

# నిషేధం అవసరమా

ఓట్ల కోసం, ఎన్నికల నాటి అవసరాల కోసం రాజకీయ నాయకులు ఆవేశపూర్ణంగా ప్రకటించే నిర్ణయాలు ఆ తర్వాత రాష్ట్రం మనుగడకు ఎంతటి భారంగా పరిణమిస్తున్నాయో తెలుసు కోవడానికి మద్య నిషేధం సజీవ నిదర్శనంగా నిల్చి పోతుంది.

నెల్లూరు జిల్లాలో సారాకు వ్యతిరేకంగా మొదలైన మహిళా ఉద్యమం నుంచి ఓట్లు పండించు కోవడానికి కాంగ్రెస్, తెలుగు దేశం పార్టీలు రెండూ పోటీలు పడి శాసన సభ ఎన్నికల సమయంలో సంపూర్ణ మద్య నిషేధ నినాదాన్ని వలవరించాయి. ఆ వేడిలో, ఆ ఉద్రేకంలో, ఆ ఎన్నికల ఆరాటంలో ఎవరూ సాధ్యా సాధ్యాలు ఆలోచించలేదు; సాంఘిక, ఆర్థిక, పాలనాపర సమస్యలు పరిగణించ లేదు! మానవ జాతి నాగరికత నేర్చిన నాటి నుంచి తరాల పాటు, యుగాల పాటు నిరంతరాయంగా కొనసాగుతున్న ఒక దుర్వ్యసనాన్ని చట్టాలతో, శాసనాలతో అదృశ్యం చేసేయ వచ్చని భావించారు; ఒకే ఒక కలం పోటుతో మద్య మహమ్మారిని శాశ్వతంగా హత మార్చినట్లు భ్రమింప జేశారు కూడా రామారావు గారు!

ఇప్పుడేమైంది - నిషేధం కేవలం కాగితాలకు పరిమిత మైంది; మద్యం మాత్రం రాష్ట్ర మంతా ఏరులై పారుతూంది. పన్నుల ఆదాయం లేక ఖజానా పట్టి పోయింది; కోట్ల కోట్ల వ్యాపారం మాత్రం స్మగ్లర్లకు భూలోక స్వర్గాలు నిర్మించి ఇస్తూంది! ముత్తు కల్లు పేరుతో కల్తీ కల్లు, సరిహద్దులు దాటి వచ్చే విస్కీ, బ్రాందీలు, ఇతర రాష్ట్రాల సారాయి పొట్లాలు, స్వరాష్ట్రపు నాటు సారా క్యాన్లు గ్రామ గ్రామంలో, ప్రతి పట్టణంలో, చివరకు రాజధాని నగరంలో యథేచ్ఛగా, నిరాటంకంగా ప్రవహిస్తూనే వున్నాయి. త్రాగుడు వ్యసనానికి బానిసలైన వారు ఆ చెర నుంచి ఏ మాత్రం విముక్తులు కాలేదు; పైపెచ్చు కల్తీ సరుకుకు బలై పోతున్నారు; తమ సంపాదన యావత్తూ ధార పోస్తున్నారు.

అది సారా కాని, బ్రాందీ కాని దొరకని వూరు లేదనడం నిజం; ఇది వరకు రూపాయితో సరిపోయేది, ఇప్పుడు నాలుగు రూపాయలు ఖర్చు అవుతున్నది - అంతే! ఎక్సైజ్ అధికారులు, పోలీసులు ఎంత గట్టి కాపలా కాస్తున్నట్లు నటించినా, పట్టుబడిన సీసాలు పగలగొట్టి సన్నివేశాలు ఎన్ని సృష్టించినా రాష్ట్రంలో విస్కీ, సారాలు, నిరంతరాయంగా ప్రవహిస్తు న్నాయనేది నిజం. పట్టుబడేవి ఒక శాతం కూడా లేవన్నది వాస్తవం. మహిళా చైతన్యం, ఉద్యమ స్ఫూర్తి కలిగిన నెల్లూరు జిల్లాలో ఈ స్మగ్లింగ్ కార్య కలాపం దావ క్రింద నీరు వలె గుంభనంగా వుంది కాని, ఇటు కోస్తాకు, అటు తెలంగాణా జిల్లాలకూ వెళ్తే అంతా బహిరంగ రహస్యమే. జేబులో డబ్బులుంటే మందుకు దిగులే లేదు. ఇది వరకు అంగడి ఎక్కడుందో వెతికి వెళ్లాల్సి వచ్చేది - ఇప్పుడు అంగడే మందు ప్రియుల ఇళ్లకు నడిచి వస్తూంది. కల్లు వ్యవహారం మరీ ప్రమాద కరం. ముత్తు కల్లు పేరుతో క్లోరల్ డీహైడ్రేట్ వంటి విషపూరిత రసాయనాలు కలిపిన మత్తు పానీయం సర్వత్రా లభ్యమౌ తున్నది. గీత కార్మికుల మాటున నాటు సారా నిపుణులు ఈ కల్లు సరఫరాను మూడు చెట్లు, ఆరు ముంతలుగా విలసిల్ల జేస్తున్నారు. కల్లు గీసుకోవడానికి అనుమతిస్తే ఒక్కొక్క టెంకాయ చెట్టుకు ఏడాదికి వెయ్యి నుంచి, రెండు వేల రూపాయల ధర చెల్లించ డానికి సిద్ధ పడుతున్నా రంటే ఇక ఈ వ్యాపారం ఎంత జోరుగా వుందేది అర్థం చేసుకోవచ్చు. ఈ మత్తు కల్లు త్రాగుబోతుల శరీరాలను స్లో పాయిజన్ వలె విష పూరితం చేస్తున్నది. వందలు ఖర్చు పెట్టి విస్కీ సీసాలు కొనే స్తోమత లేక మధ్య తరగతి కుటుంబీకులు కూడా చవకగా లభించే మత్తు కల్లును ఆశ్రయి స్తున్నారు; ఆరోగ్యం చెడ గొట్టు కొంటున్నారు. అక్కడొకటి, ఇక్కడొకటి చావులూ సంభవి స్తున్నాయి. కాని ఆలజడి రేగకుండా, వాటిని సహజ మరణాలుగా చిత్రీకరించి, మాయ చేసేస్తున్నారు.

జమీన్ రైతు

ఈ పరిస్థితులలో ఎందుకీ మద్య నిషేధం? ఎవరికి వుపయోగ పడుతున్నదిది? గవర్నర్ గారి మహోదాత్త ప్రసంగాలకు, ముఖ్య మంత్రి గారి మహా గొప్ప ప్రకటనలకు తప్ప మరి దేనికి కొరగాని మద్య నిషేధం పై పునరాలోచన, పునః పరిశీలన అవసరం. ఆచరణలో విఫలమౌ తున్నదని తెలిసీ, అదుపు చేయలేని నిస్సహాయతతో, అసత్య ప్రచారాలతో ఆత్మ వంచన చేసుకొనే కంటే నిజాన్ని నిర్భయంగా ఒప్పుకొని, ఆచరణాత్మ కమైన మద్య వ్యసన నిరోధ పథకాలకు, కార్యాచరణ ప్రణాళికకు రూపొందించడం అవసరం. ప్రభుత్వమేమో సంపూర్ణ మద్య నిషేధపు కలల్లో తేలియాడు తుంటే, ప్రజలు స్మగ్లింగ్ సారా, విస్కీలలో మునిగి తేలడం వల్ల ఎవరికీ ప్రయోజనం కలుగదు. చుట్టూరా వుండే రాష్ట్రాలు మద్య వ్యాపారం చేస్తున్నప్పుడు, మనం మాత్రం నిషేధం అంటే జరగదు. ఆదర్శాలు వల్లించడం వేరు, ఆచరణ జరిపించడం వేరు.

రేణుకా చౌదరి చెప్పినట్లు సారా వరకు నిషేధించి, విస్కీ, బ్రాందీలను కట్టు దిట్టాలలో వదిలేయడమో; లేక పరిమిత పరిధిలో, పర్మిట్ల వంటి విధానాల ద్వారా త్రాగుడుకు బానిసలైన వారి వరకు మద్యం అందుబాటులోకి తేవడమో, లేక అటువంటి మార్గం మరొకటి అన్వేషించే మద్య నిషేధ నిర్ణయాన్ని పునః సమీక్షించడం అవసరం. లేకుంటే ప్రభుత్వం దివాలా తీస్తూనే వుంటుంది; మద్యం ప్రవహిస్తూ వుంటుంది. జనం రెంటికీ చెడిన రేవడు లౌతుంటారు.

---

జమీన్ రైతు

15.2.1946
వెల: 0-1-6 పేజీలు: 8

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### తిరుగుబాటే తారకం

**క్షుదార్తులకు నెహ్రూ మంత్రోపదేశం**

"తిరిగి కరువస్తే, ఆకలి మంటలకు మిడతల వలె మలమల మాడి పోవడానికి ఈసారి ప్రజలు సమ్మతించ బోరని గుర్తించ వలసిందిగా నేను బ్రిటిష్ ప్రభుత్వాన్ని హెచ్చరించ గోరుతున్నాను. ఈ రాష్ట్రంలో క్షామం వస్తే ప్రభుత్వం పై తిరుగుబాటు చేయ వలసినదిగా నేను ప్రజలను కోర బోతున్నానని ఇప్పుడే స్పష్ట పరుస్తున్నాను"

### నెల్లూరుముచ్చట్లు

**కరవు**

జిల్లా పరిస్థితులు తారు మారుగా నున్నవి. యీ జిల్లా నుండి ఒక్క గింజైనా బైటకు పోకుండా చేసి, బైట నుండి గట్టి గింజలు దిగుమతి చేస్తే తప్ప ప్రజలు చాలా మంది కూడు లేక చస్తారు. పరిస్థితులు యింత అధ్వాన్నంగా వుంటే యీనాడు గూడ బియ్యం యింకా యితర చోట్లకు ఎగుమతి చేతున్నపంటే అధికారులు ఎంత బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నారో చూడండి.

ప్రజలు భూకంపంతో రాళ్లు బద్దలయ్యేట్లు గగ్గోలు పెట్టి ముందు బియ్యం ఎగుమతి ఆపి, యింకా అవసర ధాన్యాన్ని బైట నుండి రప్పించు కోవలె.

**ఎలక్షన్**

ఆంధ్రా పార్లమెంటరీ బోర్డు వారి సెలక్షన్ సవ్యంగా వున్నదని చెప్పడం లేదు గాని ఒక నిర్ణయం అయిన తర్వాత క్రమశిక్షణకు బద్ధ పడవద్దా? అక్రమం జరిగిం దనుకున్నా వారు సవ్యమైన పంథాలో నడవాలె గాని ఎదురు తిరగడం యేమీ భావ్యం గాలేదు. సెంట్రల్ పార్లమెంటరీ బోర్డుకు అపీలు చేయడం, పరిస్థితులు ఎరుక పరచడం, వారి తీర్మానానికి బద్ధ పడడం కాంగ్రెసు వారు, గాంధీ శిష్యులు, త్యాగ ధనులు అనుకున్న వారి లక్షణం - హనుమా రెడ్డి, లక్ష్మయ్య గారల చర్యలు ఏ మాత్రం బాగాలేవు. కాంగ్రెసు అభ్యర్థుల మీద పోటీ వేయించడానికి అందరి చుట్టూ తిరుగు తున్నారు. బ్రతిమాలు తున్నారు. బహిరంగంగా ప్రచారం చేస్తున్నారు. గోపాలు రెడ్డి గారి మీద పోటీ చేస్తున్న అక్కరాజును ప్రోత్సహిస్తున్నారు. మాటి మాటికి ఆయన చుట్టు తిరుగు తున్నారు. గూడూరు డివిజన్ కాంగ్రెసు అభ్యర్థికి మరికొన్ని పోటీ వేయించమని వెంకటగిరి వారితో హనుమా రెడ్డి చెప్పి నాడు. గోపాలు రెడ్డి గారికి పోటీగా

కొరవ 8వ పేజీలో

---

# మైపాడు బీచ్‌కు ఎన్టీఆర్ పేరు పెడితే సహించం!

## జనవాణి

రాష్ట్ర మార్కెటింగ్ శాఖ మాత్యులు రమేష్ రెడ్డి, సర్వేపల్లి శాసన సభ్యుడు సోమిరెడ్డి చంద్ర మోహన్ రెడ్డితో కలిసి 12 తేది మైపాడు బీచ్‌ను సందర్శించారు. ఈ బీచ్‌ను సుందర నందన వనం చేసి ఎన్టీఆర్ స్మారకార్థం ఆ బీచ్‌కు ఎన్టీఆర్ బీచ్‌గా పేరు మారుస్తామని ప్రకటించారు. మైపాడు బీచ్‌ని అభివృద్ధి చేసే కార్యక్రమం సంతోషించ తగినదే. కానీ ఎన్టీఆర్ బీచ్‌గా నామ కరణం చేస్తామనడం అనుచితంగా వుంది. మైపాడు స్వాతంత్ర్య పోరాటపు రోజుల నుండి చరిత్ర గలిగిన గ్రామం. జాతిపిత మహాత్మా గాంధీ, మాజీ రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ వంటి మహనీయులు సందర్శించిన గ్రామం. ఉప్పు సత్యాగ్రహంలో స్వాతంత్ర్య సమర వీరులు అత్యధికులు పాల్గొన్న పవిత్ర స్థలం ఆ బీచ్. ఈ పోరాటానికి గుర్తుగా జలగం వెంగళ రావు పిసిసి అధ్యక్షుడిగా వున్నప్పుడు, డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి నాయకత్వంలో నెల్లూరు నుండి అనేక వేల మందితో పాద యాత్ర జరిపి ఆనాటి పోరాటాలకు గుర్తుగా ఒక స్మారక స్థూపం కూడా ఆవిష్కరించారు. ఈ విధమైన గత చరిత్ర కలిగి, కాంగ్రెస్ సంస్కృతి, సౌరభాలు వెదజల్లిన ఆ బీచ్‌కు ఎన్టీఆర్ పేరు పెట్టడం ధర్మంగా లేదు. ఎన్టీఆర్ బ్రతికున్న రోజుల్లో ఒక్కసారి కూడా ఆ గ్రామాన్ని సందర్శించిన పాపాన పోలేదు. ఆ గ్రామం గూర్చి కూడా ఆయనకు తెలియదు. మైపాడు గ్రామం పట్నం కుటుంబీకులు, స్వర్గీయ దువ్వూరు బలరామి రెడ్డి వంటి స్వాతంత్ర్య సమర యోధులకు జన్మనిచ్చిన గ్రామం. గ్రామంలో ప్రజల మనోభిప్రాయం గాని, పంచాయితీ ఆమోద తీర్మానం గానీ లేకుండా బాబు తెలుగు దేశం నాయకులు మైపాడును తమ జాగీరుగా భావించి ఇష్ట మొచ్చిన రీతిలో పేర్లు మారుస్తా మనడం సబబుగా లేదు. రామారావు బొమ్మతో గత శాసన సభ ఎన్నికల్లో గెలిచిన చంద్ర మోహన రెడ్డి, మంత్రి రమేష్ రెడ్డి లిద్దరూ నయవంచకులుగా మారి ఎన్టీఆర్ ప్రభుత్వాన్ని కుప్ప కూల్చారు. చేసిన పాపం పోగొట్టుకొనే కార్యక్రమంలో భాగంగా ఎన్టీఆర్ పై కపట ప్రేమను ఒలక బోస్తూ మళ్లీ ఆయన పేరు వాడుకొని లబ్ధి పొందాలని ఏదేదో చేయాలని చూడడం ప్రజలు గమనిస్తూనే వున్నారు.

నెల్లూరు -సి.వి. శేషారెడ్డి
(మాజీ ఎమ్మెల్సీ)

### ఆర్టీవో నిద్రపోతున్నారా?

నెల్లూరు ప్రైవేట్ బస్సుల్లో ప్రయాణీకుల పట్ల సిబ్బంది ఆగడాలు రోజు రోజుకూ పెరిగి పోతున్నాయి. చాలా బస్సుల్లో ఓవర్ లోడు చేసి, స్త్రీ, పురుష భేదం లేకుండా ప్రయాణీకులను సినిమా హాళ్ల బుకింగుల వద్ద నెట్టినట్లు నెట్టుతుంటారు. వివిధ స్టాపింగులకు టిక్కెట్ల రేట్లు నిర్ణయించే బోర్డులు బస్సుల్లో సక్రమంగా వుండవు. టిక్కెట్లను ఇవ్వ కుండానే డబ్బులు గుంజేస్తున్నారు. ఇటీవల ఒక బాలికను టౌన్ బస్ ఢీ కొన్న సంఘటనలో ప్రజలు ఆగ్రహం ప్రదర్శించి బస్సును తగలబెట్టినా బస్సుల యాజమాన్యాలకు బుద్ధి రాలేదు. విసుగు కల్గించేలా స్టాపింగుల్లో ఓవర్ లోడు చేసే వరకు కాలయాపన చేస్తూ ఆపి వేయడం; తరువాత స్పీడు లిమిట్సు పాటించక ఉరుకులు పరుగులు తీయించడం సర్వ

కొరవ 9 పేజీలో

## జిల్లావార్తలు

10 పేజీ కొరవ

తూమునకు కొట్టుకొని పోవడంతో యిప్పుడిప్పుడే దానిని పూర్తి నిర్మాణ స్థాయికి తీసుకు వస్తున్నారు. అందువల్ల ఈ రిజర్వాయరు క్రింద నీరు నిల్వ చేయక పోవడంతో దీని పైనే ఆధార పడిన 13 వేల ఎకరాల్లో పంట వేయడానికి కుదరలేదు. మోపాడు రిజర్వాయర్ వున్నా, తెగిన కాలువలను మరమ్మత్తు చేయక పోవడంతో నీరు విడుదల చేయలేదు. అందువల్ల అక్కడా పంట వేయలేదు. దీనితో 9 కోట్ల రూపాయల దాకా చేతికొచ్చే పంటకు చేటు కాలం వచ్చింది.

ఒక్క కావలి మండలంలోనే చిన్న, పెద్ద కలిపి దాదాపు 30 చెరువులు వుంటే అవన్నీ వర్షం పైనే ఆధార పడేవి కావడంతో మండలంలో పరిస్థితి దారుణంగా తయారైంది.

సోమశిలకు కాస్త దగ్గరగా వున్న జలదంకి మండలానికి కూడా అధికారులు నీరు వదలక పోవడంతో 10 వేల ఎకరాల్లో పంట ఎండి పోయింది. ఈ ప్రాంతంలో మిగిలి వున్న 18 వేల ఎకరాల్లో పంటను అసలు వేయడమే జరుగలేదు.

కలిగిరి మండలంలో బాగా పండే పొగాకు, మిర్చి నీరు లేక పోవడంతో పూర్తిగా దెబ్బ తిన్నాయి. వెయ్యి ఎకరాలకు పైగా మినుము, మరో ఏడు వేల ఎకరాల్లో పొగాకు పంటలు కూడా ఇదే పరిస్థితిలో వున్నాయి. దీనివల్ల కలిగిరి మండలంలో 12 కోట్ల రూపాయల దాకా నష్టం ఏర్పడి వుండ వచ్చునని అధికారులు అంచనా వేశారు.

### మాటలు జాస్తి - సహాయం నాస్తి!

కావలి నియోజక వర్గంలో ఏర్పడిన కరువు పరిస్థితులను రాజకీయ నాయకుల దృష్టికి, అధికారుల దృష్టికి తీసుకెళ్లి రైతులు గగ్గోలు పెట్టినా వారి గోడు పట్టించుకొనే నాధుడే లేడు. డిసెంబరు నెల చివరిలో ముఖ్య మంత్రి సోమశిల నీరును కావలి కాలువకు యివ్వవలసిందిగా ఆదేశం యిచ్చినప్పటికీ యింత వరకు విడుదల చేయలేదు. తెలుగు దేశం రాష్ట్ర కౌన్సిల్ సభ్యుడు వంటేరు వేణుగోపాల రెడ్డి పై కూడా కావలి ప్రాంత రైతులు తీవ్ర కోపంతో వున్నారు. అక్టోబరులో కావలి చెరువుకు నీరు ఇవ్వకుండా బ్రాహ్మణక్రాక చెరువు వరకు మాత్రమే ఆయన నీరు యిప్పించడంతో పరిస్థితి యిలా తయారైందని రైతులు ఆగ్రహంతో వున్నారు. తరువాత తప్పు తెలుసుకున్న వేణుగోపాల రెడ్డి కావలి చెరువుకు నీరు వచ్చే ప్రయత్నాలు చేస్తానని హామీ యిచ్చి నప్పటికీ సమయం దాటి పోవడంతో వాగ్దానం నిలబెట్టు కోలేక పోయారు. నియోజక వర్గంలోని నాయకులు పార్టీల పరంగా ఆలోచిస్తూ ఎవరికి వారు పట్టీ పట్టనట్లుగా వుండడంతో ప్రస్తుతం పరిస్థితి చెయిదాటి పోగా, అధికారులు సరిగా స్పందించక పోవడంతో కావలి నియోజక వర్గం కరువు కోరల్లో చిక్కుకొని వుంది. ఇప్పటికైనా అధికారులు కళ్లు తెరిచి కావలిని కరువు ప్రాంతంగా ప్రకటించి సత్వర చర్యలు తీసు కోవాల్సిందిగా రైతులు కోరుతున్నారు.

### జె.బి. మహిళా హాస్టలుకు మూడు లక్షలు

జవహర్ భారతికి అనుబంధంగా వున్న దుర్గాభాయ్ దేశ్ ముఖ్ మహిళల హాస్టల్లో నూతనంగా నిర్మించిన నాలుగు గదులను సెకండరీ విద్యా శాఖ మంత్రి బల్లి దుర్గా ప్రసాద రావు ప్రారంభించారు.

ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో మంత్రి మాట్లాడుతూ దేశంలోనే మొదటి సారిగా కేంద్ర నిబంధనలు అనుసరించి నేషనల్ ఎడ్యుకేషనల్ పాలసీలో సూచించిన విధంగా వృత్తి విద్యా కోర్సులను ఆంధ్ర ప్రదేశ్‌లో అప్పటి ముఖ్య మంత్రి ఎన్టీ రామారావు 1985 లో అమలు పరచినట్లు చెప్పారు.

కాలేజి ప్రిన్సిపల్ వేణుగోపాల రెడ్డి చదివిన నివేదికలో 800 మంది విద్యార్థినులకు వసతి కావల్సి వుండగా 500 మందికి కూడా సరైన గదులు లేవని చెప్పడంతో, స్పందించిన మంత్రి హాస్టలు భవనానికి మూడు లక్షల రూపాయలు మంజూరు చేసారు. ఈ నిధులతో నాలుగు అదనపు గదులు నిర్మించు కోవచ్చుని, అయితే యిందుకు యాభై శాతం ఖర్చుకు అధ్యాపకులు, విద్యార్థినులు శ్రమదానం చేయ వలసి వుంటుందని చెప్పారు. ఈ విద్యా సంవత్సరంలోనే ఈ నిర్మాణాలు పూర్తి అయ్యే విధంగా చర్యలు తీసు కుంటామని చెప్పారాయన.

### అనంత సాగరం ఆసుపత్రి దుస్థితి

వైద్య శాఖాధి కారుల నిర్లక్ష్యం మూలంగా అన్ని వసతు లుండి కూడా అనంత సాగరంలోని ప్రభుత్వ ఆసుపత్రి నిరుపయోగంగా తయారై వుంది. మండల కేంద్రమైన అనంత సాగరంలో 1959 సంవత్సరంలో ఒక పూరి పాకలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ప్రారంభ మయ్యింది. తర్వాత కొంత కాలానికి దాన్ని ఆసుపత్రిగా అప్‌గ్రేడు చేసి భవన వసతితో పాటు ఆరు పడకలు ఏర్పాటు చేశారు. నాలుగేళ్ల క్రితం ఆసుపత్రి ప్రక్కనే డాక్టర్ల నివాసానికి భవనం కూడా నిర్మించారు. అయితే ప్రస్తుతం పని చేసే డాక్టరు అందులో నివాసం వుండక నెల్లూరు నుండి నెలకు ఐదారు రోజులు మాత్రమే వచ్చి పోతుండడంతో రోగుల పాట్లు చెప్పనలివి కావడం లేదు. ఈ ఆసుపత్రిలో ముగ్గురు డాక్టర్లు, యుడిసి, ల్యాబ్ టెక్నీషియన్, 11 మంది ఎ.ఎన్.ఎం.లు, ఒక స్టాఫ్ నర్సు వుండాలి. వీరిలో ఇద్దరు అటెండర్లు, బి.ఇ.ఇ. కాంపౌండర్ మాత్రమే ప్రస్తుతం విధులకు హాజరవుతున్నారు. స్టాఫ్ నర్స్ చేరిన మరుసటి రోజే లాంగ్ లీవ్ పెట్టి అరబ్ దేశాలకు వెళ్లి పోయింది. తనకు ఆరోగ్యం బాగా లేనందున ఈ ఆసుపత్రిలోనే వుండి పనిచేస్తే తన ప్రాణాలకే భద్రత లేదని డాక్టర్ అంటున్నారు. ల్యాబ్ టెక్నీషియన్ కూడా డాక్టర్ బాటలోనే నడుస్తూ ఆసుపత్రికి అప్పుడప్పుడు మాత్రమే హాజరవుతారు. ఫార్మసిస్టుకు, డాక్టరుకు పొత్తులు కుదరక జిల్లా కేంద్రం నుంచి మందులు సకాలానికి తీసుక రారు. తెచ్చినా సెప్ట్రిన్ వంటి మందులను సిబ్బంది వాడక పోవడంతో ఇటీవల విలువైన మందులను వృధాగా పారేశారు. ఆసుపత్రికి వచ్చే సిబ్బంది తమకు ఓపిక వుంటేనే వైద్యం అందిస్తుంటారు. సాయంత్రం పూట ఆసుపత్రిలో ఏ ఒక్కరూ కనిపించరు. దీనివల్ల అత్యవసర కేసులను ఆత్మకూరు ఆసుపత్రికి తరలించక తప్పడం లేదు. లేడీ డాక్టర్ లేక పోవడం కూడా సమస్యగా మారి వుంది. ఆసుపత్రిలోని ఆరు పడకలు కూడా అధ్వాన్న స్థితిలో వున్నాయి. వీటిని రిపేరు చేయించక రోగులను నేల పై పడుకో బెట్టి సెలైన్లు ఎక్కిస్తుంటారు. పంచాయితీ తన నిధులతో ఆసుపత్రిలో మరుగు దొడ్లు నిర్మించినా ఆసుపత్రి సిబ్బంది వాటి నిర్వహణ బాధ్యత చూడటలేదు. ఆసుపత్రిలోని రికార్డుల్లో మాత్రం అన్ని వేళలా మందులు ఇస్తూ వైద్యం చేస్తున్నట్లు నమోదు చేసి వుంటున్నారు. జిల్లా వైద్యాధి కారి ఒకసారి ఈ ఆసుపత్రిని సందర్శించి సిబ్బందిని అదుపులోకి తెచ్చి ప్రజలకు వైద్య సౌకర్యాలు మెరుగు పడేలా చేయాల్సి వుంది.

## విదేశీ ధనం

2 పేజీ కొరవ

నరసింహా రావు పై పార్టీ లోపల రగుల్కొంటున్న అసంతృప్తి వంటి సంఘటన లేవీ షేర్ మార్కెట్ పై తమ ప్రభావం చూపక పోవడం! సాధారణంగా ఇటువంటి రాజకీయ అయోమయ పరిస్థితులలో షేర్ మార్కెట్ సంక్షుభితమౌతూ వుంటుంది. డాలర్ ధర హెచ్చు తగ్గుల ప్రభావాన్ని సైతం మార్కెట్ తట్టుకోగ్గడం విశేషం.

దీన్ని టెక్నికల్ రికవరీ అనవచ్చు. దీనివల్ల షేర్లలో విపరీతంగా నష్ట పోయి, మానసికంగా అశాంతికి లోనై వున్న చిన్న ఇన్వెస్టర్లకు కొంత వూపిరి పీల్చుకొనే వ్యవధి లభిస్తుంది. భారతీయ షేర్ మార్కెట్లో పెట్టుబడులు పూర్తిగా జూదం కాదని, తాత్కాలికంగా నష్ట పోయినా ఏదో ఒక రోజు బయటపడ వచ్చుననే నమ్మకం కల్గించింది రికవరీ!

దీర్ఘ కాలంలో లాభాలు దృష్టిలో పెట్టుకొని షేర్ల పై పెట్టుబడులు పెట్ట దగిన సమయమిది. టిఎస్ఐఎస్, టాటా పవర్, హోటల్ లీలా, భారత్ హోటల్ వంటి షేర్లను అదను చూసి కొనవచ్చు.

## చంద్ర ప్రాణం

మొదటి పేజీ కొరవ

ప్రసంగాలకు రెచ్చి పోకుండా, గుంభనంగా, లోలోపల సర్దుబాటు ప్రయత్నం జరుపు తున్నారు. రేపటి ఎన్నికలలో రాష్ట్రమంతా తిరిగి, జనం దృష్టి నాకర్షించి, ప్రచారం నిర్వహించ గల సమర్థత వుండేది హరికృష్ణ ఒక్కడికే. ఆయన అలిగి కూర్చుంటే పార్లమెంట్ ఎన్నికల్లో అభాసు పాలు కాక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. అందువల్లే ముఖ్య మంత్రి తన సమయాన్నంతటినీ అలుక తీర్చడానికి వెచ్చిస్తున్నారు. ఈయన తగ్గి వచ్చే కొద్దీ ఆయన రెచ్చి పోతున్నారు. ఈ బావా బావమరదుల వివాదం ఎమ్మెల్యేలకు మాత్రం చక్కటి వినోద కాలక్షేపం కల్గిస్తోంది.

## నెల్లూరు ముచ్చట్లు

5 వ పేజీ కొరవ

వల్లనే వారికి పోలీసులంటే అలుసై పోయినట్లుంది. రాజీ సమయంలో కూడా అటువంటి నిస్సహాయతే ఆవరించి నట్లుంది పోలీసు అధికారులను. డిఎస్పీ గారు అసలే గంగి గోవు; పైగా నిందితులతో ఆయనకు నిత్య సంబంధా లున్నాయట. ఫలితమే ఈ దౌర్భాగ్య పరిస్థితి.

డిఎస్పీ గారూ - సాధు స్వభావిగా పేరు పొందాలని వుంటే కాషాయం కట్టి సన్యసించండి; అంతే తప్ప ఖాకీ దుస్తులు వేసుకొని శాంత ప్రబోధాలతో కాలం గడిపితే ఎట్లాగండి బాబూ!

### కల్కి భగవాన్ ఆలయ సామూహిక రుద్రాభిషేకం

నెల్లూరులోని శ్రీ కల్కి భగవాన్ ఆలయం ఆధ్వర్యంలో మహా శివరాత్రి సందర్భంగా సామూహిక రుద్రాభిషేకం నిర్వహిస్తున్నారు. టౌన్‌హాల్‌లో జరిగే ఈ కార్యక్రమంలో ఎవరైనా పాల్గొన వచ్చు. దీని స్పెషాలిటీ - పూజారితో నిమిత్తం లేకుండా దంపతులు స్వయంగా శివ లింగానికి అభిషేకం జరిపే ఏర్పాటు చేయడం. భక్తులకు ఆహ్వానమందజేస్తున్నారు శ్రీ చివుకుల మాల కొండయ్య.

### పార్ట్‌టైం లెక్చరర్ల రాష్ట్ర స్థాయి సదస్సు

పార్ట్ టైం లెక్చరర్ల సమస్యల సాధన కోసం జరప వలసిన పోరాట కార్యక్రమాన్ని నిర్ణయించ డానికి రేపు ఆదివారం (18 తేది) విఆర్ కాలేజి ఆవరణంలో రాష్ట్ర స్థాయి సదస్సు నిర్వహిస్తున్నారు -నెల్లూరు సంఘం నిర్వాహకులు. ఎయిడెడ్ కళాశాలల్లోనూ టైం స్కేలు వర్తింపు, సర్వీసుల క్రమబద్ధీకరణ తదితరాలు వీరి డిమాండ్లు. జిల్లాలోని అన్ని కాలేజిల లెక్చరర్లు సమావేశానికి రావాలని పిలుస్తున్నారు.


కృతజ్ఞతాంజలి



మా ఆహ్వానాన్ని మన్నించి 9-2-96న జరిగిన మా ప్రియ పుత్రిక చి॥ సౌ॥ సుధ - చి॥ నవీన్‌ల వివాహ మహోత్సవమునకు విచ్చేసి వధూవరులను ఆశీర్వదించిన మీ కందరికీ మరియు కళ్యాణ మహోత్సవ నిర్వహణను అనుపమానంగా నిర్వహించిన మా కంపెనీ డైరెక్టర్లకు, డీలర్లకు, బంధుమిత్రులకు, స్టాఫ్ మరియు వర్కర్లందరికీ ఇవే మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

బోడా చితంబరం
బోడా పార్వతి

Thums Up

మేనేజింగ్ డైరెక్టర్
పినాకిని బెవరేజస్ (ప్రై) లిమిటెడ్.

B.R.Ads. Ph : 24851



**నాణ్యతకు సాటి లేదు- రుచికి పోలికే వుండదు!**

కమ్మటి సుగంధ ద్రవ్యాల సువాసనలతో ఘుమఘుమ లాడే

**నిర్మల డీలక్స్ వక్కపొడి**

సరిక్రొత్త ప్యాకింగ్‌లో, తాజాదనంతో తయారౌతుంది!

50 గ్రాములు, వంద గ్రాముల ప్యాకింగ్‌లోనూ లభిస్తుంది!



**TWO STORIED BUILDING FOR SALE**

Located in Nellore Town, towards west of Vedayapalem Bus Stand - in Thikkavarapu Pattabhirama Reddy Sites - A two storied building of 32 Ankanams in 60 Ankanams of site for sale.

Vanamali - Phones: 27354, 23334

# నేను అల్లా ఆరాధకుడ్ని - కాని ముస్లింను కాను!

ఎ.ఆర్. రెహమాన్ రికార్డింగ్ థియేటర్ బయట కూర్చొనున్న హీరో అరవింద స్వామిని "మీకు స్వామి భక్తి ఎక్కువా?" అని అడిగారు రెహమాన్. "అప్పుడు లేనట్టే; నా పరమూర్తే ఏటు వరకూ భయ భక్తులతో గుళ్ళూ గోపురాలూ చుట్టి వాళ్ళి; దానివల్ల చెప్పుకో తగ్గ మంచి ఏదీ జరగ లేదు. క్రమక్రమంగా ఆ దైవభక్తి సన్నగిల్లింది. పూర్తిగా నాస్తికుడ్ని అయ్యేసరికి సినిమా చాన్సులు నన్ను వెతుక్కుంటూ వచ్చాయి. బిజీ నటుడ్ని అయ్యాను. పేరొచ్చింది. ఎప్పుడైనా మా అమ్మ "గుడిలో అర్చన చేయిస్తాను రారా" అంటే ఆమె వెంట వెళ్తానే గాని, మునుపటిలా ఆరాధించడమంటూ ఉండదు" అంటూ అరవింద స్వామి నవ్వి, "అవునూ, మీ నాన్న గారు మ్యూజిక్ డైరక్టర్ ఆర్.ఎ. శేఖర్ హిందువు కదా; నువ్వెలా ముస్లిమ్ అయ్యావు? అని అడిగాడు.

బాల్యంలోనే తండ్రిని దూరం చేసినందువల్ల నాకు అదో విధమైన విరక్తి కలిగింది. మనశ్శాంతి కరువైన సమయంలో నాకు ఆదరువుగా వెన్నంటో ఉండడానికి ఏదో శక్తి అవసర మైంది. ఇస్లాం మతంలో ఆ శక్తి ఉంటుందన్న విశ్వాసాన్ని ఒక ముస్లిమ్ మిత్రుడు కలిగించాడు. నేను అల్లా ఆరాధకుడ్ని అయ్యాను. అంత మాత్రం చేత నేను మతం మారినట్లు కాదు. అన్ని మతాలూ నాకు సమ్మతమే. నేపథ్య గాయకుడు మనూ ముస్లిం కదా? కాని, అతను పాడే ప్రతి పాట రికార్డింగ్ ముందు "అగజానన పద్మార్కం" అంటూ

### ఎఆర్ రెహమాన్ చెప్పిన నిజం!

అర్కెస్ట్రాతో గణపతి స్తుతి చేస్తారు; తప్పేముంది? అంటూ రెహమాన్ తన దగ్గరున్న పెట్టె మూత తెరిచాడు. అందులో క్యాడ్‌బరీస్ చాక్లెట్లున్నాయి. "ఏమిటీ వోసం" అంటూ అరవింద స్వామి ఒక చాక్లెట్ అందు కున్నాడు "మాకు అమ్మాయి పుట్టింది" అని రెహమాన్ ఆనందంతో అనగానే అరవింద స్వామి కరచాలనం చేశాడు.

### ఇవివి దర్శకత్వంలో అందాజ్ అప్నా - అప్నా

మనకు హాస్య రచయితలకు కరువు లేదు. వాళ్ళ చేత రాయించే ఓపిక, వ్యవధి మన దర్శక నిర్మాతలకు లేదు. అందుచేత, హిందీలో విజయ వంతమైన "అందాజ్ - అప్నా, అప్నా" చిత్రాన్ని తెలుగులో తీయడానికి ఎస్.వి.ఎస్. క్రియేషన్స్ వారు సన్నాహాలు చేస్తున్నారు. శ్రీకాంత్, చక్రవర్తి హీరోలు. హీరోయిన్లుగా కొత్త వారిని పరిచయం చేస్తున్నట్లు డైరెక్టర్ ఇ.వి.వి. సత్యనారాయణ చెప్పారు.

### గౌతమి హర్షాతిరేకం

గౌతమి కనిపించిన వారం దరితోనూ చెప్తోంది - తాను మణిరత్నం చిత్రంలో బుక్ అయినట్లు. "ఆనందం" చిత్రంలో ఆమె కూడా ఉందట. ఇంత కన్నా ఆనందం ఇంకేం కావాలి?

# "నేనసలు పుట్టేదాన్నే కాదు"

శిల్పాశెట్టి 5 అడుగుల 8 అంగుళాల పొడుగరి. ఒక షూటింగ్ స్థలంలో విచార వదనంతో కూర్చొని సిగరెట్ పీలుస్తోంది. ప్రొడక్షన్ మేనేజర్ కొన్ని ఎక్స్‌రే ఫోటోలు తీసుకొచ్చి ఆమెకు చూపుతూ "మేడమ్! గుడ్ న్యూస్ ఎముక విరగ లేదు అని డాక్టర్ చెప్పాడు" అన్నారు. విచారిస్తే తెలిందేమిటంటే క్రితం రోజు షూటింగ్‌లో ప్రభుదేవాతో డాన్స్ కోసం స్టెప్స్ వేస్తున్నప్పుడు ఆమె పట్టు తప్పి క్రింద పడి పోయిందట. కాలు ఫ్రాక్చర్ అయిందను కొని షూటింగ్ కేన్సిల్ చేశారట. "హమ్మయ్య!" అంటూ శిల్ప నోట్లోంచి సిగరెట్‌ను తీసి బయట పారేసింది. "నేనసలు పుట్టేదాన్ని కానేమో! తమాషా కాదండీ, నిజమే; గర్భవతి అయినప్పుడు మా అమ్మకు ఏదో జబ్బు చేసింది. వెంటనే ఆ గర్భాన్ని తొలగించు కోకపోతే అమ్మ ప్రాణానికే ఆపత్తు సంభవించినా సంభ వించొచ్చు అని డాక్టర్లు చెప్పారట. కాని, అమ్మ మొండి ఘటం - అబార్షన్ చేయించు కోలేదు. కొంత కాలానికి ఆ జబ్బు ఎలాగో నయమైందనుకోండి. ఫలితం - నేను పుట్టాను. మాకు రెండు కార్లున్నా నన్ను కాన్వెంట్‌కి బస్సులోనే పంపించేది మా అమ్మ. నన్ను చంపేయ కుండా ఎందుకు కన్నావ్? అని ఒక్కోసారి కోపంతో అనేదాన్ని. కాని, అమ్మ అలా

### శిల్పాశెట్టికి చిరు ప్రమాదం!

పెంచ బట్టే కష్టాలంటే ఏమిటో నాకు తెలిసొచ్చాయి, అంది శిల్పాశెట్టి నవ్వుతూ.

### కళ్యాణ చక్రవర్తి చెప్పిన విషయాలు

పెద నాన్న ఎన్‌టిఆర్ పెద్ద కర్మ ముగిశాక హైదరాబాద్ నుంచి తిరిగొచ్చిన కళ్యాణ చక్రవర్తి గద్గద స్వరంతో కొన్ని విషయాలు చెప్పారు "అంతిమ యాత్రలో పెదనాన్న భౌతిక కాయం ఉన్న వ్యాన్‌లోకి ఆయన ఏడుగురు పుత్రులతో పాటూ నేను ఎక్కబోయాను. హరికృష్ణ చూసి

కొరవ 9 పేజీలో

# "పరిచయం" తో కొత్త దర్శకుడి పరిచయం!

నేను దర్శకుడుగా పరిచయ మయ్యే తొలి చిత్రం పేరు 'పరిచయం'; తమాషాగా లేదూ? అన్నాడు వెంకట కృష్ణ. ఈయన దాదాపు పదేళ్ల పాటు పి.ఎస్. రామచంద్ర రావు వద్ద సహకార దర్శకుడుగా పనిచేశాడు. కథ, స్క్రీన్‌ప్లే, మాటలు కూడా ఈయనే సమకూర్చాడట. అజిత్ కుమార్, సింధు జాయిజా నాయకులు. సంగీతం: విద్యాసాగర్.

### జాబిలమ్మ పెళ్ళి

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం వహిస్తున్న పై చిత్రంలో జగపతి బాబు, మహేశ్వరి, వాణిశ్రీ ముఖ్య పాత్రధారులు. కథ, మాటలు: కె.ఎల్. ప్రసాద్. సంగీతం: కీరవాణి.



అమ్మాయి మొగుడు చిత్రంలో రమ్యకృష్ణ

### భారతీయ సినిమా ప్రతిభకు గీటురాయి!

# బండిట్ క్వీన్

### చిత్రసమీక్ష
గ్రిద్దలూరు గోపాలరావు

హిందీ చలన చిత్రం "బండిట్ క్వీన్" ఒక యదార్థ గాథ. ఒకప్పటి బందిపోటు రాణి (బండిట్ క్వీన్) పూలన్ దేవి వీరోచితమైన జీవిత గాథ. ఉత్తర ప్రదేశ్ కుగ్రామాల్లో నెలకొని వుండిన వికృత సాంఘిక, అరాచక వాతావరణం, ప్రజాభక్షకురాలిగా తయారైన పోలీస్ వ్యవస్థ పూలన్‌దేవిని పలురకాలుగా హింసిం చాయి. ఆమె కొందరు ఫ్యూడల్ శక్తుల మదోన్మత్తతతో అనాగరికంగా, పైశాచికంగా మానభంగానికి గురైంది. దానికి ప్రతీకారేచ్ఛతో చంబల్ లోయలో బంది పోటు రాణిగా మారి, పగసాధించి దేశ వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. 1982 ప్రాంతంలో ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్ ప్రభుత్వాలను గడగడ లాడించింది. ధన బలాన్ని, జాత్యహం కారాన్ని, నిరంకుశత్వాన్ని, కామాంధ కారాన్ని ప్రతిఘటించి పాతమార్చి వీర వనితగా పేరు గాంచింది.

పూలన్ దేవి జీవితం మూలాన్ సేన చేతిలో ఒక బరువైన నవలగా తయారైంది. ఆ నవల ఆధారంగా దర్శకుడు శేఖర్ కపూర్ "బండిట్ క్వీన్" చిత్రాన్ని ప్రజాను రంజకంగా రూపొందించాడు.

ఉత్తరప్రదేశ్‌లోని గోరాన్ పురా గ్రామంలో పుట్టి పెరిగిన దళిత జాతికి చెందిన నిరక్షరాస్య యువతి పూలన్ దేవి. చిన్నప్పటి నుంచి పూలన్ దేవి చురుగ్గా, కొద్దిగా తిరుగుబాటు ధోరణి కలిగి వుండేది. పదకొండు ఏళ్ల వయస్సులో తనకంటే రెండు రెట్లు వయసున్న అతనికిచ్చి పెళ్ళి చేస్తారు. భర్త దుర్మార్గాన్ని భరించలేక పోతుంది. అక్కడే ఆమెలో తిరుగుబాటు తత్వం పెరుగుతుంది. ఒక రోజు కట్టెల కోసం పొలం వెళ్ళిన ఆమెను, ఆ ఊరి ఠాకూర్ (గ్రామాధికారి) కుర్రోడు మానభంగం చెయ్య బోతాడు. రెచ్చిపోయిన ఆమె ఆ కుర్రాడి చెంప చెళ్ళుమనిపిస్తుంది. తప్పు ఠాకూర్ కుర్రాడిదే అయినా ఆమె శిక్షననుభవిస్తుంది. ఆమెను పుట్టింటికి పంపేస్తాడు భర్త. ఆ ఊళ్ళోనూ ఠాకూర్ యువకుల కామ చేష్టలకు తట్టుకోలేక, తనను అవమానించిన వారందరి పై పగ సాధించేందుకు ఆమె బందిపోట్లకు నిలయమైన చంబల్ లోయకు పారి పోతుంది. విక్రం మల్లా అనే బంది పోటు ఆమెను ప్రేమిస్తాడు. చంబల్ లోయలోని ఒక బందిపోటు నాయకుడు ఆమెను మానభంగం చేస్తూ వుంటాడు. అది చూసిన ఆమె ప్రియుడు విక్రం మల్లా అతన్ని కాల్చి చంపి ఆనామెను మల్లా పెళ్ళి చేసుకుంటాడు.

ఠాకూర్ల ప్రమేయంతో జరిగిన పోలీస్ దాడుల్లో పూలన్ దేవి చిక్కు బడుతుంది. పోలీసులూ ఆమెను మానభంగం చేస్తారు. ఆమె భర్త విక్రం మల్లా పోలీసు తుపాకికి బలవుతాడు. అప్పటి నుంచి పూలన్ దేవి బందిపోటు రాణిగా బందిపోటు ముఠాను నడుపుతుంది. ఠాకూర్ మద్దతు దార్లు ఆమెను పట్టి ఒక పశువుల కొట్టంలో సామూహిక మానభంగం సాగిస్తారు. ఆ తర్వాత బలరాం అనే ముఠా నాయకుడు గ్రామంలో ఆమెను అందరి ముందు పూర్తి నగ్నంగా ఊరేగిస్తాడు. ఈ సంఘటనతో ఆమెలో ప్రతీకార వాంఛ

కొరవ 8 పేజీలో

## నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

అయ్యాక నేను చిక్కి పోతున్నానని మా అమ్మ చెబుతూంది. నాకే ఛైర్మన్ పుల్లె కిలలం పెద్ద అని కౌన్సిలర్ల సభ్యుల మధ్య అన్నారు. 93 - 94 సంవత్సరానికి తయారు చేసిన నెల్లూరు పురపాలక సంఘ నివేదిక పై స్వతంత్ర సభ్యుడు సంచాని బాపి వివరణలు ప్రతిపాదించారు. టౌన్‌లోని చెత్తను అత్యవసరంగా తొలగించేందుకు 96 వేల రూపాయలు ఖర్చుతో రూపొందించిన తీర్మానాన్ని కూడా కౌన్సిల్ ఆమోదించింది. మునిసిపల్ అధికారుల నిర్లక్ష్యం వల్ల 40 లక్షల రూపాయల వ్యయంతో జరగాల్సిన విజయ మహల్ అండర్ బ్రిడ్జి పని ఖర్చు కోటి రూపాయలకు చేరుకొందని కౌన్సిలర్ పున్నం బసవయ్య విమర్శించారు.

### చెత్త తొలగింపుకు కొత్త కార్యక్రమం

టౌన్‌లో పలు చోట్ల చెత్తా చెదారం పేరుకు పోయి టౌన్‌లోని అనేక ప్రాంతాలు పరమ చెత్తగా తయారై వున్న విషయాన్ని మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి అంగీక రించారు. ప్రస్తుతం టౌన్‌లో 636 ట్రిప్పుల చెత్త, మట్టి పేరుకు పోయి వుంటాయని ఒక అంచనా తయారు చేసారు. శ్రమదానం తరహాలో 96 వేల రూపాయల వ్యయంతో దీన్ని తొలగించేందుకు ఒక కార్యక్రమాన్ని రూపొందించినట్లు 12 తేది మునిసిపల్ ఆఫీసులోని తన ఛాంబర్‌లో విలేకరులకు వివరించారాయన. దీని కోసం మూడు రోజుల కార్యక్రమాన్ని రూపొంది స్తున్నారు. ఈ కార్యక్రమంలో 16 మునిసిపల్ ట్రాక్టర్లు, ఒక లారీతో పాటు, 40 అద్దె ట్రాక్టర్లను వుపయోగించ నున్నారు. ఈ కార్యక్రమంలో వార్డు కౌన్సిలర్లు, ప్రజలు, లయన్స్, రోటరీ క్లబ్, ఎన్.ఎస్.ఎస్. వాలంటీర్లతో పాటు స్వచ్ఛంద సంస్థల సహకారం తీసుకొంటా మన్నారు. మునిసి పాలిటీలోని రెవిన్యూ, టౌన్ ప్లానింగ్ హెల్త్ సిబ్బందితో పాటు టీచర్లను కూడా ఉపయోగిస్తా మన్నారు. ప్రజా ఆరోగ్య శాఖలో 2 వేల మంది వుద్యోగులు కావల్సి వుండగా కేవలం 500 మంది మాత్రమే వున్నట్లు ఛైర్మన్ వివరించారు. వేదాయపాళెం వంటి చోట్ల ఆ ప్రాంతంలో చెత్త తొలగిం చేందుకు కేవలం 6 మందే సిబ్బంది వున్నారని. దీనితో విశాలమైన ప్రాంతంలో చెత్త తొలగించడం ఎంత వరకు సాధ్యమో ఆలోచించా లన్నారు. 44 వరకు వున్న స్లమ్ వసతి వున్న నెల్లూరు టౌన్‌ను ఇప్పుడున్న సిబ్బందితో చూత చక్కగా తయారు చేయడం సాధ్యమవదు. అందువల్లే ప్రయోగాత్మకంగా చెత్త తొలగింపు కార్యక్రమం చేపడుతున్నట్లు చెప్పారు. ఒకటో వార్డు నుంచి పదో వార్డు వరకు వివిధ ప్రాంతాల్లోని చెత్తతో నవలాకుల తోటలోని మామిడి ప్లాంట్లకు, 11 నుంచి 16 వార్డు, 30వార్డు చెత్తను పెప వరుస ప్రాంతాలకు, 17 వార్డు నుంచి మిగతా వార్డుల చెత్తను సర్వేపల్లి కొండ రూట్‌లోని పొరంబోకు స్థలాలకు తరలిస్తా మన్నారు. వేదాయ పాళెంలోని చెత్తను భక్త వత్సల నగర్ ప్రాంతాల్లో మట్టి కోసం త్రవ్విన గుంటలను నింప మన్నారు. ప్రజలు ఈ కార్యక్రమంలో పాల్గొని సహక రించాలని ఛైర్మన్ కోరారు.

### కంప్యూటర్ సహాయంతో పట్టుబడిన మోసగాడు

నెల్లూరు పోలీసులు నేర పరిశోధనలో కాసింత ముందడుగు వేసారు. పలువురిని మోసగించి పరారీలో వున్న ఉప్పులపాటి వెంకటేశ్వర్లు (35) అనే ఘరానా మోసగాడ్ని, కంప్యూటర్ ద్వారా పోలికలు గుర్తించి 10 తేది అరెస్టు చేయగలిగారు. ఇతడి నుంచి 35 వేల రూపాయలు విలువ చేసే నగలు, 100 రూపాయల దొంగ నోట్ల కట్టలు రెండింటిని స్వాధీనం చేసుకొన్నారు. టౌన్ డిఎస్‌పి వెంకటేశ్వర రెడ్డి కథనం ప్రకారం శోధన్ నగర్‌లోని కల్లూరు వెంకమ్మ గృహంలో ఒక పోర్షన్‌ను వెంకటేశ్వర్లు అద్దెకు తీసుకొన్నాడు. ఒక సూట్‌కేసులో నోట్ల కట్టలు పెట్టి జాగ్రత్తగా దాచి వుంచమని ఇంటి యజమానురాలిని కోరాడు. ఇళ్లు, స్థలాలు కొనడం తన వ్యాపారమని నమ్మబలికాడు. ఒక రోజు బ్యాంకులో లాకరులో వున్న తన సొమ్ము తీసు కొనేందుకు ఒక మహిళ అవసరమని, పని మనిషికి విలువైన నగలు వేసి తీసుకు వెళ్లేందుకు సహకారం కోరాడు. వెంకటేశ్వర్లు మాటలు నమ్మిన వెంకమ్మ 30 వేల రూపాయలు విలువ చేసే నగలు, పట్టు చీర అతనికి ఇచ్చింది. పని మనిషితో వెళ్లిన వెంకటేశ్వర్లు తిరిగి రాలేదు. వెంకమ్మ పోలీసులకు ఫిర్యాదు చేసె. ఆ మోసగాడి పోలికలను పోలీసులకు తెల్పింది. పోలీసు ఆఫీసులోని కంప్యూటర్ సహాయంతో రూపు రేఖల చిత్రాన్ని తయారు చేసి టౌన్‌లోని అన్ని స్టేషన్లకు పంపారు. క్రైమ్ బాగోలేక 10 తేది ఎస్. బొమ్మ వద్ద వెంకటేశ్వర్లు తమ చేతికి చిక్కిపోయాడని వన్ టౌన్ క్రైం సబ్ ఇన్స్‌పెక్టర్ వెంకట స్వామి చెప్పారు. నిందితుడు ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో గతంలో అనేక మోసాలకు పాల్పడి జైలు శిక్ష కూడా అను భవించాడట. టౌన్‌లో అపరిచితులకు బాడుగకు ఇళ్లు ఇచ్చే సమయంలో ఇంటి యజమానులు జాగ్రత్త వహించా లంటున్నారు పోలీసులు.

### రామకృష్ణ పరమహంస జయంతి సభ

నెల్లూరు వర్తమాన సమాజం ఆధ్వర్యంలో 20 తేది టౌన్ హాల్‌లో శ్రీరామకృష్ణ పరమహంస జయంతి సభ జరుగుతుంది. సమాజం అధ్యక్షులు సి.వి. రమణా రెడ్డి అధ్యక్షతన జరిగే కార్యక్రమానికి ముఖ్య అతిథిగా జె.వి. రెడ్డి విచ్చేస్తారు. గూడూరు డివైన్ లైన్ సొసైటీ అధ్యక్షులు చదలవాడ వెంకట శేషయ్య రామకృష్ణ పరమ హంస - వేదాంత తత్వం పై వుపన్య సిస్తారు. అనంతరం సభా పోషకులు రొటేరియన్ ఎం. ధర్మారెడ్డి తమ తల్లి స్వర్గీయ మలుచూరు లక్ష్మయ్య స్మృత్యంకంగా వుపన్యాసకుని సన్మానిస్తారని సమాజం కార్యదర్శి టి.వి. నరసింహం తెలియ జేస్తున్నారు.

### సంగీత, నృత్య స్కూలు వార్షికోత్సవం!

మూలపేటలోని శ్రీ మహతి సంగీత, నృత్య విద్యాలయం 8వ వార్షికోత్సవం 18 తేది వేద సంస్కృత కళాశాల ఆవరణలో జరుగుతుంది. ఈ సందర్భంగా 18 తేది ఉదయం కళాశాల విద్యార్థుల ఊరేగింపు, పంచరత్న కీర్తనల గోష్టి, మధ్యాహ్నం టి. చంద్రశేఖర్, రాజ్యలక్ష్మి, ఎం. శారద, వి. దేవసేన, జె.వి.ఎస్. ఆర్.ఎన్. ప్రసాద్, టి. వేణు గోపాలాచారి, ఎం. లక్ష్మి సుప్రియ, డి. అనూరాధ, కె. శిరీష లత గార్ల వయొలిన్ గాత్ర కచ్చేరి జరుగుతుంది. అనంతరం నాట్యాచార్య ఎస్.వి. రమణయ్య శిష్య బృందంచే భరత నాట్య, కూచిపూడి, జానపద నృత్యాలు నిర్వహిస్తారు. రాత్రి సన్మాన కార్యక్రమాలు, బహుమతి ప్రదానోత్సవం జరుగు తాయని నిర్వాహకులు తెలియ జేశారు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

పోటీగా అక్కిరాజును తాము వేయిస్తు న్నామని లక్ష్మయ్య గారు యితరులతో చెప్పినారు. ఎవ్వరూ వేయక పోతే గోపాలురెడ్డి గారికి పోటీ తానే వేస్తానని హనుమా రెడ్డి ట్రంకు రోడ్డులో ప్రచారం చేశాడు. ఇవన్నీ చేయరాని పనులు. యిన్ని సంవత్సరాలు సేవ చేశాము, త్యాగం చేశాము అనే వాళ్లు చేయ వలసిన పనులేనా యివి?

కాంగ్రెసు వాదులారా! గతం గతః జరిగింది మరచి పోండి, యికనైనా అందరూ ఒక చోటికి చేరి కార్మోన్ముఖులు కండి. కమ్యూనిస్టులు, ఇతర వ్యక్తులు, మనలో చీలికలకు నిరీక్షిస్తుంటారు. వారికి సందివ్వ వద్దు. శాసన సభ్యత్వానికి యింత పోట్లాటా? అబ్బ! సమయ మొచ్చినప్పుడు గాని నిజమైన కాంగ్రెసు వాదుల తత్వం బైట బడదు. కమ్యూనిస్టు పార్టీ వార్ని చూచి నేర్చుకోండి. జి.సి. కొండయ్యను పెట్టకుండా బలరామి రెడ్డిని పెట్టినందుకు కొండయ్య గాని, వారి పక్షీయులు గాని ట్రంకు రోడ్డులో భాగోత మాడారా? యిలాటి చర్యలతో ఎంత పెద్ద వ్యక్తి అయినా గడ్డి పరక కంటె పేలవమై పోతాడు. జరిగింది మరచి పోయి, ఏక పక్షంగా ఏక కుటుంబంగా కార్మోన్ముఖులు కండి.

-విమర్శకుడు

### పల్లెటూళ్లు

#### మైపాడు స్టోరు

చక్కెరకు కంది బొరుగులు పోటీ బెట్టి అమ్మించు చున్నారు. చక్కెర వగైరాలకు పోటీ పెట్ట కూడదని కలెక్టరు ఉత్తర్వున్నా దాన్ని ధిక్కరిస్తున్నారు. అధికారులు జోక్యం పుచ్చుకోవలె.

#### చిత్రజగత్

పుల్లయ్య గారు గొల్లభామను త్వరలో చల్ల ముంతతో ఆంధ్ర దేశానికి పంపాలని ప్రయత్నిస్తున్నారు.

* * *

శరభోజి మహారాజా శాసన సభా యుద్ధ రంగంలో వున్నందున త్యాగయ్య గారి విడుదల విషయం వెనక్కు పోతూంది.

* * *

రాధేయ దర్శకులు తంగిరాల వారు మొన్ననే పూనా నుంచి వచ్చినట్లు వార్త. శ్రీనాథుడు రాధేయుడుగా త్వరలో షూటింగ్ ప్రారంభం కాబోతూందట. కానీ పూనాలో కాదు.

* * *

ప్రవరాఖ్యుడికి గిరిజా బుందవచ్చా అనే ప్రశ్నతో తర్క వితర్కాల లోబడి కొసకి సినిమా వరూధినికి గిరజాలు లేకుంటే రోమాన్సు పుట్టదని తీర్మానించారట వరూధిని డైరక్టరు శ్రీ బి.వి. రామానందం.

* * *

సూర్య కుమారి ఇద్దార్లకి మీనా అనే చిత్రంలో నటిస్తుందట. భావ ఏదో?

## సినిమా

7 పేజీ తరువాయి

అగ్ని పర్వతమైంది. అదును చూసుకొని గ్రామం మీద దాడి చేసి ఆ గ్రామ కూడలిలో ఠాకూర్లందరిని వరుసగా హత మారుస్తుంది. ఒకప్పుడు తనను చెరచ బోయిన ఠాకూర్ కుర్రవాళ్ల గుంపుకు కత్తి చావ గొడుతుంది. ఆ తర్వాత బందిపోట్ల లొంగుబాటు ఉద్యమంలో అశేష ప్రజానీకం సమక్షంలో, పూలన్ దేవి తన ఆయుధాలను ప్రభుత్వానికి అప్పగించి లొంగి పోతుంది.

పూలన్ దేవి జీవితంలో జరిగిన ప్రతి సంఘటననూ పొల్లు పోకుండా చాలా వాస్తవంగా చిత్రీకరించాడు దర్శకుడు. ఆమె అనుభవించిన నరకాన్ని, మానభంగాలను, మానసిక క్షోభను, ఆమెలో స్వతహాగా అణిగి వున్న వ్యక్తిత్వాన్ని, ప్రతి ఘటనను గొప్పగా చూపించారు. గ్రామస్తులందరి ముందు పూలన్ దేవిని నగ్నంగా ఊరేగించిన దృశ్యాన్ని కూడా ఒక నిమిషం పాటు చూపారు. మన కళ్ళ ముందు జరుగుతున్నదా అన్న పటుత్వం ప్రతి సన్నివేశంలో కన్పించింది.

ఈ చిత్రాన్ని విడుదల చేసేందుకు శేఖర్‌కపూర్ చాలా వ్యతిరేకతను చవి చూడ వలసి వచ్చింది. సెన్సార్ కాక ముందే ఈ చిత్రాన్ని విదేశాల్లో జరిగిన అంతర్జాతీయ ఫిలిం ఫెస్టివల్స్‌లో ప్రదర్శించి అందరి ప్రశంస లందుకొన్నారు. దర్శకుడు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించాడు. ఇటీవలే ఇది హైదరాబాదులో విడుదలైంది.

పూలన్ దేవి పాత్రను కొత్త నటి సీమా బిస్వాస్ పోషించింది. అసలైన పూలన్ దేవిని చూస్తున్నామా అన్నంతగా గొప్పగా నటించింది. మిగతా నటులంతా కూడా బాగా నటించారు. అశోక్ మెహతా కెమెరా పనితనం ఎంత మెచ్చుకున్నా చాలదు.

ఈ చిత్రం ఇండియన్ సినిమా ప్రతిష్టను శిఖరాగ్రానికి తీసుక పోయాడు దర్శకుడు శేఖర్ కపూర్.

## పంచాంగం

### మహాశివరాత్రి

17 తేది శనివారం మహాశివరాత్రి

### ముహూర్తములు

21 తేది బుధవారం పగలు 11.28 గంటలకు వృషభ లగ్నమున గృహారంభ వివాహ వ్యాపార ప్రారంభములకు

23 తేది శుక్రవారం సూర్యోదయానికి ముందు 2.38 గంటలకు ధనుర్లగ్నమున గృహ ప్రవేశ, వివాహములకు ఉదయం 10.00 గంటలకు మేష లగ్నమున సుముహూర్తములు

### ఫిబ్రవరి తిథులు

మాఘ బహుళ

తే 17 శని త్రయోదశి ఉ.గ. 10.25 వ

తే 18 ఆది చతుర్దశి ఉ.గ. 8.05 వ

తరువాత పూర్తి అమావాస్య

ఫాల్గుణ శుద్ధ

తే 19 సోమ పాడ్యమి రా.గ. 3.57 వ

తే 20 మంగళ విదియ రా.గ. 2.20 వ

తే 21 బుధ తదియ రా.గ. 1.10 వ

తే 22 గురు చతుర్థి రా.గ. 12.20 వ

తే 23 శుక్ర పంచమి రా.గ. 12.02 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

## ఉత్తరక్రియలు

మా తల్లి

### కొలుకుదురు యశోదమ్మ గారు

1.2.96 తేది శనివారం స్వర్గస్థులైరి. వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ, ఉత్తరక్రియలు

20.2.96 తేది మంగళవారం నిలువు

21.2.96 తేది బుధవారం ఎత్తుదేవు

బెగుంటపాడులోని మా స్వగృహమున జరుగును.

కుమారులు-కోడళ్ళు:

కొల్లుకుదురు రమణారెడ్డి - పరమేశ్వరమ్మ

కొల్లుకుదురు శ్రీనివాసులు రెడ్డి - విజయమ్మ

కుమార్తెలు - అల్లుళ్లు:

పరమేశ్వరమ్మ - సి.హెచ్. మోహన్ రెడ్డి

శైల - వి. వెంకటేశ్వర రెడ్డి

ఆరబోసిన ఆడవారి అందాలు చూడకుండా
పిల్లల కళ్లు మూసేయగలిగితే మంచి చిత్రం

# సాహసవీరుడు - సాగరకన్య

చిత్రసమీక్ష
అల్లూరు రహీం

తాను అనుకొన్న దృశ్యాన్ని అద్భుతంగా మలిచి, తెర పై చూపి ప్రేక్షకులను మంత్ర ముగ్ధులను చేసే తెలుగు సినీ దర్శకుల్లో రాఘవేంద్ర రావు అగ్ర గణ్యుడు. తను తీసిన చిత్రాల్లో కథలో పెద్ద పసలేక పోయినా, పాటలు, అబ్బుర పరిచే సన్నివేశ చిత్రణతో పలు చిత్రాలను గట్టెక్కించిన ఘనాపాటి. ఆయన తాజాగా తీసిన ఫాంటసీ చిత్రం సాహస వీరుడు - సాగర కన్య చిత్రం చూస్తుంటే పాత హిందీ చిత్రం అన్‌మోల్ మోతి. ఆయనే గతంలో దర్శకత్వం వహించిన జగదేక వీరుడు - అతిలోక సుందరి చిత్రాల్లోని పలు సన్నివేశాలను తిరిగి చూసినట్లే వున్నాయి. కాని మారిన హీరో, హీరోయిన్లు, భారీ సెట్టింగులు, కమ్మనైన పాటలు, టెక్నిక్ జిమ్మిక్కుల నడుమ అవన్నీ గుర్తుకు రావు.

ఒక వార్తా పత్రికలో మనీలా సమీపంలో జలకన్యను చూశామంటూ కొందరు జాలర్లను ఉటంకిస్తూ వచ్చిన వార్తను ప్రస్తావించి తాను చెప్పబోతున్న కథ ఊహాజనితం కాదని, ప్రేక్షకులకు దర్శకుడు నచ్చ జెప్పచూశాడు. సముద్ర గర్భంలో స్పెషల్ ఎఫెక్ట్స్‌తో సృష్టించిన జల జీవ రాసులను చూపిస్తూ ఎక్కడా లోపం కనిపించని విధంగా తమ కెమెరాతో అద్భుతాలను ఆవిష్కరించారు. ప్రేక్షకులంతా ఈ సన్నివేశాలను అబ్బుర పడుతూ చూస్తారు. ఈ సన్నివేశాల మధ్య సాగర గర్భం నుంచి భూమి మీదకు వచ్చిన సాగర కన్య తెలుగు మాట్లాడినా, ఒక చేట నీళ్లలో పడి మత్స్య రూపం వచ్చినప్పుడు ప్యాంట్ స్టవ్‌ను వాడి రూపు మార్చుకొన్నా పెద్దగా గమనించ కుండేలా దర్శకుడు స్క్రీన్‌ప్లేను చకచకా నడిపారు. ఉత్తరాది యువకుల హృదయాల్లో కల్లోలం రేపుతున్న హీరోయిన్ శిల్పాశెట్టిని సాగర కన్యగా శరీరం పై అచ్ఛాదనంటూ లేకుండా, పొడవైన కాళ్లు చూపించడం; చేప పిల్లలా నేరు మెలికలు త్రిప్పించడం, సినిమా మొత్తం నాభి క్రిందకే దుస్తులు ధరింపజేసి చూపించడంతో, ప్రేక్షకులలోని యువ హృదయాలు కలవర పడతాయి. మత్స్య కన్య తానూ మానవుల వలె తల్లి కావాలంటూ పరితపించడం, చివరి సన్నివేశంలో ఆమెకు పుణ్య స్నానాలు చేయించడం వంటివి మహిళా హృదయాలను కంట తడి పెట్టిస్తాయి. సాగర గర్భంలో నౌక, ఈ హీరో, విలన్ల ఛేజింగులు, సాగరకన్య తుళ్లింతలు చిన్న పిల్లలను ఆనంద పరుస్తాయి. టెక్నికల్‌గా లోపాలు కనపడ కుండా తీసిన దర్శకుడు ఒక చేట ఎడిటర్ మూలంగా పప్పులో కాలేసారు. ఆదనపు హీరోయిన్ మాలాశ్రీ పై తీసిన శ్రీనాథ కవితలోని పాటలో ట్రాలి పై ఆమెను స్పీడుగా లాగే సన్నివేశంలో ట్రాలి కూడా కనపడి పోయింది పాపం! పాటల సన్నివేశాలలో పిల్లల కళ్లు మూసేయ గల్గితే కుటుంబ సమేతంగా ఈ చిత్రాన్ని చూడవచ్చు. కాని టివి ఛానెల్స్‌కు అలవాటు పడ్డ పిల్లలకు ఈ మాత్రం డోసు శృంగార దృశ్యాలు కొత్త గాదనుకోండి.

ఇక కథ కమామీషు లోకి వస్తే బంగారు రాజా (సత్య నారాయణ) స్వాతంత్ర్యం వచ్చాక భారత దేశం నుంచి అపూర్వ సంపదను తీసుకు వెళుతూ బ్రిటిష్ నౌక ఒకటి సాగర గర్భంలో మునిగి పోయిందనే వార్త తెలుసుకొని, ఆ సంపద చేజిక్కించుకోను ప్రయత్నాలు చేస్తుంటాడు. ఆ నౌకకు దారి చూప గల సత్తా మత్స్య కన్య (శిల్పాశెట్టి) కే వుందని ఘంటా పథంగా చెప్పిన మాంత్రికు రాలు మాంచాల (విజయ లలిత) సలహాలతో నిధి స్వంతం చేసుకోను యత్నిస్తుంటాడు. ఈ దశలో సముద్రంలో చేపలు పట్టుకొంటూ చందమామ కథలు చదివే హీరో రవి (వెంకటేష్) వలలో మత్స్య కన్య చిక్కు కొంటుంది. ఆమె రూపంలో కనిపించడం, వింతగా ప్రవర్తించడంతో అమాయకురాలని తలచి ఆమెకు తన గృహంలో ఆశ్రయ మిస్తాడు. ఒకానొక సమయంలో సౌందర్య పోటీల్లో మత్స్య కన్య, హీరో పాల్గొన్నప్పుడు మెడలోని హారాన్ని చూసిన బంగారు రాజా ఆమెను మత్స్య కన్యగా గుర్తిస్తాడు. మాంత్రికురాలు మాంచాల ఆ విషయాన్ని బల పరచడంతో, ఆమెను బంధించను హీరోను నానా తిప్పలు పెడతారు. చివరికి విలన్ గ్యాంగునంతా హతమార్చి మత్స్య కన్య సహాయంతో అపూర్వ సంపదను ప్రభుత్వ పరం చేస్తాడు రవి. మత్స్య కన్యను పెళ్లి చేసుకోలేడు కాబట్టి మరో హీరోయిన్ గంగ (మాలాశ్రీ)ని వివాహ మాడుతాడు మన హీరో.

చిత్ర కథతో పాటు మాటలను పరచూరి సోదరులు వ్రాసారు. వేటూరి, జొన్నవిత్తుల కలాల్లో నుంచి జాలు వారిన ఘడియ ఘడియకో ముద్దు, వీణ, వీణ, జలతారు వీణ పాటలు బాగున్నాయి. పాటల కోసం ఆకర్షించే సెట్టింగులను ముస్తాబు చేయించి ప్రేక్షకుల కన్నుల ముందు భారీ ఖర్చును సాక్షాత్కరింప జేశారు. కీరవాణి సంగీతం శ్రావ్యంగా వున్నా, పలుచోట్ల ఇంతకు ముందు చిత్రాలకు వాడిన బిట్స్ వినిపిస్తాయి. నటీ నటుల్లో వెంకటేష, శిల్పాశెట్టి, మాలాశ్రీ, సత్య నారాయణ, విజయలలిత, కోట శ్రీనివాస రావు హుషారుగా నటించారు. బ్రహ్మానందం, గుండు హనుమంత రావు, సుత్తివేలు, రాళ్లపల్లి, బాబూ మోహన్, అనంత్ వంటి హాస్య నటులకు నటించ తగ్గ పాత్రలు లభించలేదు.

## జనవాణి

3 పేజీ కొరవ

సాధారణమై పోయింది. ఇన్ని విమర్శలు వచ్చినా రవాణాశాఖాధికారుల్లో కాసింత చలనం కూడా లేనట్లుంది. యువకుడైన ఆర్టీవో తన కుర్చీలో కూర్చొని నిద్ర పోతున్నట్లుంది. ఈసారి టౌన్‌లో ఏదైనా రోడ్డు ప్రమాదం జరిగి ఎవరైనా ప్రాణాలు కోల్పోతే ఈసారి ప్రజల ఆగ్రహానికి రవాణా శాఖాధికారులే గురి కావల్సి వస్తుందని వారు గమనిస్తే మంచిది.

నెల్లూరు -పి.ఎం.కె. గాంధీ

### పోస్టల్ డిపార్ట్‌మెంటుకు కృతజ్ఞతలు!

నేను నెల్లూరీయుడనైనా ప్రస్తుతం కొచ్చిన్‌లో ఉంటున్నాను. నెల్లూరులో పోస్ట్ అయిన జమీన్‌రైతు పత్రిక ఈ దేశంలోనే వున్నా కొచ్చిన్ చేరను 20 రోజులు పట్టేది. కాని ఫిబ్రవరి 2 తేది సంచిక మాత్రం 6 తేదినే చేరి పాఠకునిగా నాకు ఆనందాన్ని ఆశ్చర్యాన్ని కల్గించింది. ఇదే మాదిరి పోస్టల్ డిపార్ట్‌మెంట్ పత్రికను సకాలానికి అందిస్తే, అంతకు మించిన ఆనందం వుండదు. నాకు అంతకు మునుపు జనవరి 12, 19, 26 తేదిల సంచికలు పోస్టల్ శాఖ సత్తె నడక పుణ్యాన ఫిబ్రవరి 2, 3, 6 తేదిల్లో చేరాయి. పోస్టల్ శాఖ తన ధోరణిని ఎప్పుడు మార్చు కొంటుందో?

కొచ్చిన్ -ఎస్. రామచంద్రారెడ్డి

### శీనయ్య విగ్రహానికి మాల వేయించాల్సింది!

నేను జమీన్‌రైతు పత్రికకు పాత పాఠకుడ్ని. పోస్టు ద్వారా పత్రిక లేటుగా అందుతుందని మార్కెట్‌లో వెంటనే కొని చదివే తరహా వ్యక్తిని. ఫిబ్రవరి 2తేది సంచికలో సఖుగుడు శీర్షికన 'బోనులో సింహం' వార్తా విశ్లేషణ బాగుంది. కోటలో జగన్మోహన రెడ్డి జనార్ధన రెడ్డి చేత స్వర్గీయ శ్రీనివాసులు రెడ్డి విగ్రహానికి పూల మాల వేయించి వుంటే బాగుండేది. ఈ చర్యను కోట ప్రజలు హర్షించి తీరే వారు. ఆ సంచికలోనే గతంలో తప్పున్న వారిని ఆదరించి జనార్ధన రెడ్డి ఎదుర్కొన్న సంకట పరిస్థితి పై చక్కని చురక వేసారు. రిపబ్లిక్ దినోత్సవాలకు జిల్లాకు సంబంధించిన ఇద్దరు మంత్రులూ హాజరు కాక పోవడం ఆశ్చర్యం కల్గిస్తుంది. జాతీయ జెండా వీరికి కాంగ్రెస్ జెండా వలె కనిపించి ఈ కార్యక్రమానికి రానట్లుంది. కాని ఆ రోజు సాయంత్రం ఎసి స్టేడియంలో జరిగిన మద్య దహన వీక్షణానికి మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డి ఠంచన్‌గా హాజరయ్యారు. జిల్లాలో కాంగ్రెస్ పార్టీని నడిపించమని పిల్ల నాయకులకు పని అప్పగిస్తే తోటను విరగ దీసిన కోతుల సామెతను గుర్తుకు తెస్తున్నారు. కాంగ్రెస్ పార్టీకి వృద్ధ సింహమైనా, సంజీవ రెడ్డి దిసిన కుర్చీకి నిండుగా వుంటారు. అదే విధంగా నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డి కూడా!

గూడూరు -భరత్‌సింగ్

## నటరత్న నందమూరి

రసిక్

సినిమాలంటే అర్థం గాని
వయసు ప్రాయంలో
చూశాను నీ తొలి చిత్రాన్ని.
సినిమాలంటే వెగటు పుడుతున్న దశలో
చూశాను నీ తుది చిత్రాన్ని;
దానికి దీనికి నడుమ నీవు
ఎన్ని వందల చిత్రాల్లో నటించి
వుంటావో
అందులో ఎన్ని డజన్ల చిత్రాలను
నేను చూశానో
లెక్క పెట్టలేను గాని
ఒక్కటి మాత్రం నిజం
చుక్కల్లో చంద్రునిలా సాగింది
చక్కని నీ నటనా వైదగ్ద్యం
ఒక్క నేనే కాదు
ఆరునొక్క కోట్ల ఆంధ్రుల డెందాల్లో
నందమూరించావు; 'నందమూరి' అన్న
ఇంటి పేరు సార్థకం గావించుకొన్నావు

* * *

ఏక పత్నీ వ్రతుడైన
శ్రీరామచంద్రునిగా తెరపై
ఎంతగా రాణించావో
అష్ట పత్నీ సమేతుడైన శ్రీకృష్ణ
భగవానునిగా
అంతగానూ రాణించావు!
"రామునెవ్వరు గనిరి? కృష్ణునెవ్వరు
గనిరి?
నందమూరిని కనిరి, ఓ కూనలమ్మ!"
అని కవుల నోట
అభినందనలందు కొన్నావు!

* * *

గంభీరంగా, ఉదాత్తంగా భీష్మ పాత్రను
ఎలా రూపుకట్టావో
అంకిత భావంతో 'బృహన్నల'
పాత్రనూ
ఎంతో అందంగా మాకందజేశావు
తెలిసిన మూర్ఖుడుగా పేరొందిన
రావణున్ని,
తెలియని మూర్ఖుడుగా
పేర్గాంచిన సుయోధనుణ్ణి
ఆ పాత్రల పట్ల ఒకింత సానుభూతి
కలిగే లాగున
అభినయించి అందరి ప్రశంసలకు
పాత్రమయ్యావు!

* * *

నేపాళ మాంత్రికుని వెన్నంటి
అమాయకంగా నడుస్తోన్న
ప్రేమకోసమై వలలో పడిన
నాటి తోట రాముడు
"కన్ను తెరచినగాని, కన్ను మూసిన
గాని మల్లి రూపే నిలిచెనే..."
అని పాడుతూ వియోగ వ్యథతో
కొట్టు మిట్టాడే నాగరాజా
పగల రాణివి నీవే, సొగసు కాడను
నేనే అంటూ రాకుమారిని
ఉడికిస్తూ, బిరర గొడుతూ సాగే
మంచి బందిపోటూ,
అష్ట దిగ్గజాలతో భువన
విజయంలో సవిలాసంగా
సాహిత్య చర్చలు సాగించే
సార్వభౌముడు కృష్ణరాయులు,
ఆదరించే రాజులు లేక, అవసాన
కాలంలో దుర్భరమైన
అవమాన పరంపరకు బలియైన
రసజ్ఞ కవి చక్రవర్తి శ్రీనాథుడు,
ఇలా ఎన్నెన్ని చారిత్రక, జానపద
చిత్రాలను
రక్తి గట్టించావో, రసార్ణవమై నిలిచావో?

* * *

సాంఘిక చిత్రాల మాటకు వస్తే
'మిస్సమ్మ' కు భర్త గాని భర్తగా
'గుండమ్మ' ఆట కట్టించిన అల్లునిగా
దొంగగా, దొరగా, పేదగా, ధనికునిగా
బడిపంతులుగా, ప్రొఫెసరుగా
ఒకోటిమిటి, సమకాలీన సంఘంలో
తారసిల్లే
ప్రతి ఒక్క వ్యక్తిని నాయక భూమికలో
ప్రదర్శించావు, ప్రేక్షకులను మెప్పించావు

* * *

ఇంత నటనా వైదుష్యం, ఇంత
నటనా వైవిధ్యం
చలన చిత్ర రంగంలో చూపెట్టిన
వారూ,
ఇంతటి దివ్యమంగళ విగ్రహం
కలవారూ,
మరొకరు తెలుగు వారికి లభ్యపడరేమో!
అందుకే నీవు తనువు చాలించావని విని
అశ్రుతప్తమై నిలిచి వున్నది
. రసలుబ్ధ ఆంధ్రావని
ఎదలోని చెమ్మ కన్నుల్లో ఊరిఊరి
ఓ నటరత్నమా, నందమూరి!
అర్పిస్తున్నాము శ్రద్ధాంజలి
అందుకో ఈ పదాంజలి

## సినిమా

7 పేజీ కొరవ

"తమ్ముడూ, తప్పు మా నాన్న గారుండగా నువ్వు దహన క్రియలు జరిగే చోటకు రాకూడదు దిగు" అన్న వెంటనే నేను దిగేశాను. నా తర్వాత లక్ష్మీ పార్వతి గారు వ్యాన్ ఎక్కడానికి ప్రయత్నించినప్పుడు కూడా హర న్నయ్య ఇలాగే వారించారు. కళ్యాణ చక్రవర్తి తండ్రి (ఎన్‌టిఆర్ తమ్ముడు త్రివిక్రమ రావు) పక్షవాతంతో అస్వస్థులై వున్నారు. ఇప్పుడిప్పుడే ఆయన క్రమ క్రమంగా కోలు కుంటున్నారు

### గమ్యం

శ్రీకాంత్, శరత్ బాబు, దేవదాస్ కనకాల, గీత, రవళి మున్నగు వారితో జి. అనిల్ దర్శకత్వం నెలకొల్పుతున్న "గమ్యం" చిత్రం షూటింగ్ మార్చి నెలలో పూర్తవుతుంది.

## భామా కలాపం

2 పేజీ కొరవ

వీళ్లకు పార్లమెంటులో కూర్చొని ఏమి చెయ్యాలో తెలియక పోయి. రాజ్యసభను స్టూడియో ఫ్లోరు అనుకొని అలవాటులో పొరపాటుగా తమ వొంట బట్టిన విద్యను అప్పుడప్పుడు వెల్లడి చేస్తుంటారేమో? అంత పరకే సరిపెట్టు కుంటే మేలే; ముందు ముందు సినిమా బూతుల పూతలు రొడిగి సువాసనలు వెదజల్ల కుంటే అదే పదివేలు.

భారత ప్రజాస్వామ్యమా, నిన్ను పొగడ నా తరమా! అందుకనే ఆ పని చేయినోళ్లన్న ఆదిశేషుడికి వదిలే స్తున్నాను.

- పొకాల వెంకటకృష్ణయ్య

# గూడూరు డాక్టర్లను ధనపిశాచి ఆవహించిందా?

**శవాల నుంచీ కాసులు పిండే నీచానికి దిగజారి పోతున్నారు; బడిత పూజ చేస్తే కాని ఈ దెయ్యం వదిలేట్టు లేదు!**

ప్రభుత్వ వైద్యశాలల్లో కాలు పెట్టను రోగులే కాదు, చచ్చిన వారి బంధువులూ వణికి పోతున్నారు. డబ్బులిస్తే గాని వైద్యం చేయక పోవడం డాక్టర్లకు అలవాటైంది. ఆ దెబ్బతో పేషంట్లు రాకపోయే సరికి, ఇప్పుడు ప్రమాదాల్లో మరణించిన వ్యక్తుల తాలూకు శవాలకు పోస్టు మార్టం చేయను కూడా వేలాది రూపాయలు డిమాండ్ చేస్తున్నారు. గూడూరు ప్రభుత్వ ఆసుపత్రిలో పనిచేసే డాక్టర్ సిద్ధిఖ్ ఈ విషయంలో మరింత స్పీడుగా వున్నట్లున్నారు. 9 తేది వాకాడు వద్ద జరిగిన ఒక రోడ్డు ప్రమాదంలో గాయపడి గూడూరు ప్రభుత్వ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించిన గజేంద్రన్ అనే పేద వాడి శవాన్ని పోస్టు మార్టం చేయను 4 వేల రూపాయలు అడిగారట ఆయన. డబ్బు చెల్లించే స్థాయి లేక పోవడంతో శవాన్ని డాక్టర్ పోస్టు మార్టం చేయలేదు. స్థానికంగా పనిచేసే విలేకరులు జిల్లా కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావుతో స్వయంగా ఫోనులో మాట్లాడి గూడూరు డాక్టర్‌కు ప్రత్యేక డోసు ఇప్పిస్తే గాని ఆయన దిగిరాలేదు. గజేంద్రన్, కేకులు, బిస్కట్లు మోపెడ్ పై తీసుకెళ్లి చుట్టు ప్రక్కల గ్రామాల్లో అమ్మి వచ్చేవారు. 9 తేది వాకాడు నుంచి తిరిగి వస్తుండగా రోడ్డు ప్రమాదంలో గాయ పడ్డారు. ఇతనికి వాకాడు ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రాథమిక చికిత్స చేసి గూడూరు ప్రభుత్వ ఆసుపత్రికి తరలించారు. ఆ తర్వాత కొద్ది సేపటికే గజేంద్రన్ మరణించాడట. ప్రక్కరోజు ప్రొద్దున్నే శవాన్ని పోస్టు మార్టం చేసి ఇస్తానన్న డాక్టర్ ఎందువల్లో తన ధోరణి మార్చుకొని పోయి శవ పరీక్షకు డబ్బులు డిమాండ్ చేసారు. బంధువులు తమకు అంత స్థాయి లేదనడంతో డాక్టర్ మనుబోలు మండలం వీరంపల్లి గ్రామంలో జరిగిన మర్డర్ కేసులో చని పోయిన వ్యక్తి శవానికి రేటు కుదుర్చుకొని దానికి పోస్టు మార్టం చేయను వెళ్లి పోయారు. ఏమి చేయాలో పాలుపోని గజేంద్రన్ బంధువులు స్థానిక పత్రికా విలేఖరులకు మొర పెట్టుకోగా వారంతా వెళ్లి డాక్టరును ప్రాధేయ పడినా ఆయన ఒప్పుకోలేదు. పైగా మెలిక పెట్టారు. యాక్సిడెంట్ వాకాడు ప్రాంతంలో జరిగింది కాబట్టి అక్కడి డాక్టరే వచ్చి పోస్టు మార్టం చేయాలన్నారు. కాని అక్కడ డాక్టర్ లేక పోవడంతో విలేకరులు వాకాడు ఎస్‌ఐ దుర్గా సింగ్‌ను ఆసుపత్రికి తీసుకొచ్చి లిఖిత పూర్వక అభ్యర్థన ఇచ్చినా ఆయన పట్టించు కోలేదు. చివరికి కలెక్టర్ ఫోనుతో దారికొచ్చి పోస్టు మార్టం చేసారాయన. గతంలో కూడా గూడూరు ప్రభుత్వ ఆసుపత్రిలో పోస్టు మార్టం చేయక పలు శవాలను కుళ్ల బెట్టిన ఘనత వుంది. ప్రాణాలు కాపాడ వలసిన డాక్టర్లు శవాలపై సంపా దించాలని దురాశ పెంచుకోవడం దారుణం.

# ఆత్మకూరు డాక్టరు అన్యాయంగా ఒక మహిళను చంపేశాడు!

**డబ్బు కోసం అనవసర ఆపరేషను ఆస్పత్రిలో నిత్య నరకం!**

ఆత్మకూరు ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రస్తుత పరిస్థితులు అధ్వాన్న స్థితిలో వున్నాయి. రోగులను పీక్కు తినే రాబందులుగా సిబ్బంది మారడంతో ఆసుపత్రికి వచ్చే వారే కరువయ్యారు. విధిలేక గతిలేక ఆసుపత్రికి వెళ్లే వారు తప్ప, కొంచెం చేతిలో కాసులున్న వారు ఆసుపత్రి పరిసరాలకు పోనే భయపడి పోతున్నారు. 1956 - 57 లో ఇక్కడ డాక్టర్‌గా పనిచేసిన ప్రస్తుత మాజీ ఎమ్మెల్యే సుందర రామిరెడ్డి, 61 - 62 లో పనిచేసిన లక్ష్మి నరసా రెడ్డి హాయాంలో ఆసుపత్రికి రోజుకు 400 మందికి పైగా రోగులు వచ్చే వారు. ఇప్పుడు పూరి జనాభా పెరిగినా చుట్టు ప్రక్కల ప్రాంతాల నుండి కనీసం 40 మంది రావడం కూడా గనా కష్టమై పోయింది. ఈ ఆసుపత్రిలో ఇద్దరు మగ డాక్టర్లు, ఒక లేడి డాక్టర్, ఇద్దరు స్టాఫ్ నర్సులు, మరో ఇద్దరు ఎ.ఎన్.ఎం.లు, ఒక ట్రెస్సరు, ఇద్దరు స్వీపర్లు పనిలేక గళ్ళ గల్లా కాంటూ కూర్చొని వున్నారు. ఇటీవల ఆసుపత్రిలో పనిచేసే ఒక మగ డాక్టర్ ప్రసవానికి వచ్చిన గర్భవతికి అవక తవక ఆపరేషన్ చేసి ఆమె మరణానికి కారకుడయ్యాడట. తాను చేసిన పొరపాటు ఎక్కడ రట్టు అవుతుందోనని మరణించిన ఆ మహిళ శవాన్ని తానే బాడుగ కారులో ఆమె స్వగ్రామానికి చేర్చి, వారి కుటుంబానికి వేలాది రూపాయలు పాప పరిహారంగా చెల్లించి వచ్చాడు. ఆసుపత్రిలో లేడి డాక్టర్ వుండగా ఈ డాక్టరు డబ్బులకు కక్కుర్తిపడే ఈ అనవసర ఆపరేషన్ చేసినట్లు వినికిడి. ఆసుపత్రిలో పనిచేసే ఇద్దరు స్టాఫ్ నర్సులు 20 ఏళ్లుగా బదలీలు లేకుండా ఇక్కడే డ్యూటీలు చేస్తూ, పై అధికారులకు మామూళ్లు ఇచ్చి మేనేజ్ చేస్తున్నట్లు సర్వత్రా చెప్పు కొంటున్నారు. ఇక్కడి సిబ్బందికి రోగులను చీదరించు కోవడం మినహా వైద్యం సేవలు అందించడం చేతకాదు. మందులు మాకులు - రోగుల ఆహారం గూర్చి ప్రత్యేకంగా వ్రాయ నవసరం లేదు. ఆత్మకూరు చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజల అవసరాలను ఏ మాత్రం తీర్చలేని ఈ ప్రభుత్వ ఆసుపత్రి వుండీ లేనట్లే. ఆత్మకూరులో మూడు పువ్వులూ ఆరు కాయల్గా వర్ధిలుతున్న ప్రైవేటు ఆసుపత్రులే దీనికి సాక్ష్యం!

# కరువు కోరల్లో చిక్కి విలవిల లాడుతూంది కావలి!

**పైర్లు పశువుల మేతకు కూడా పనికి రావడం లేదు; వెంటనే మేలుకోకుంటే రైతు గతి దుర్గతే!**

గత వర్షాకాలంలో వానలు కురవక పోవడంతో కావలి నియోజక వర్గంలో కరువు పరిస్థితి నెలకొని వుంది. జలదంకి, కొండా పురం, కలిగిరి మండలాల్లోని అత్యధిక చెరువులు వర్షం పైనే ఆధార పడేవి కావడంతో వేసిన పంటలు ఎండి పోయి, పరిస్థితి దయనీయంగా మారి వుంది. దీనివల్ల నియోజక వర్గంలో ఇప్పటికే దాదాపు 40 కోట్ల రూపాయల పంట నష్టం జరిగినట్లు అంచనా.

కావలి కాలువ ద్వారా సోమశిల నీరు రావల్సి వుండగా అధికారుల నిర్లక్ష్యం వల్ల ఆలస్యంగా వదిలారు. కాని అవి కావలి చెరువు వరకు వచ్చే పరిస్థితి లేదు. సోమశిల నుండి బ్రాహ్మణక్రాక చెరువు వరకు మాత్రమే నీళ్లు వచ్చాయి. దీనివల్ల కావలి చెరువు క్రింద ఆధార పడిన దాదాపు 12 వేల ఎకరాల్లో పంట ఎండి పోయింది. దీనివల్ల 10 కోట్ల రూపాయల మేరకు రైతులు నష్ట పోయారు.

సోమశిల నీరు రాక పోవడంతో డివిజన్‌లోని ఉీర ప్రాంతాల్లో వున్న చెన్నాయ పాలెం, మన్నంగి దిన్నె, తుమ్మల పెంట చెరువులు కూడా ఎండి పోయే పరిస్థితి ఏర్పడింది. చిన్న చిన్న వాగుల నీటితో నిండే చెరువులూ ఎండి పోవడంతో వెయ్యి ఎకరాలల్లో వేసిన పైరు నేరు పశువులకు మేతగా మాత్రమే చేతికొచ్చింది. వేలాది ఎకరాల్లో వేసి వున్న పొగాకు, మిర్చి, వేరు శెనగ యితర పంటలు కూడా ప్రస్తుతం చేతికి వస్తాయన్న గ్యారంటీ లేదు.

నియోజక వర్గంలో కొండాపురం మండలంలో వున్న పెద్ద రిజర్వాయరు రాళ్లపాడు అయితే; ఈ రిజర్వాయరు

కొరవ 6 పేజీలో

స్త్రీల టానిక్ లోధ్ర
బాధారహిత ఆరోగ్యమును స్త్రీలకు 90 సంవత్సరములుగా ఇచ్చుచున్నది
స్త్రీలకు కలుగు అకాల బహిష్టు, ముట్టుకుట్టు, బహుతురక్తం ఎక్కువ తక్కువగా పోవుట, నడుము నొప్పి, సంతానహీనత, గర్భకాలపు జబ్బులకు
ఉచిత వైద్య సలహా కొఱకై ఈ ప్రక్క చిరునామాతో సంప్రదించండి
తయారుచేయువారు:
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-600 014.
ఏజంట్లు: సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్, విజయవాడ - 1 - [illegible]

**అపార్టుమెంటు అమ్మబడును**
నెల్లూరు దర్గామిట్ట కస్తూరి దేవి విద్యాలయం ఎదురుగా [illegible] మానస అపార్టుమెంట్సులోని 2 బెడ్ రూములు పూర్తిగా ఫర్నిష్ చేయబడిన అపార్టుమెంటు అమ్మబడును.
వివరములకు సంప్రదించండి
నెల్లూరు ఫోన్: 25268
బెంగుళూరు ఫోన్: 080-6635633

**కార్మిక రాజ్య భీమా సంస్థ**
కాశిఖేల అగ్రహారం, నెల్లూరు. ఫోన్: 27719
ఇ.ఎస్.ఐ. కార్పొరేషను దేశ వ్యాప్తంగా ప్రత్యేక సేవల నిమిత్తం ఫిబ్రవరి 10 వ తారీకు నుండి 24 తేది వరకు పక్షోత్సవం నిర్వహించు చున్నది. ఈ సందర్భంగా స్థానిక కార్యాలయం మేనేజరు గారు ఫిబ్రవరి 14, 20 తేదీలలో తమ ఆఫీసులో సాయంత్రం 3 గంటలకు ప్రత్యేక షికాయత్ అదాలత్‌లను నిర్వహించెదరు. ఈ అవకాశంను ఇ.ఎస్.ఐ. భీమాదారులు, కార్మికులు వినియోగించుకొని తమ సమస్యలను తెల్ప వచ్చునని స్థానిక కార్యాలయం మేనేజరు గారు తెలియ జేయుచున్నారు.
O. RAMACHANDRA RAO - Manager

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Navagara Paper Products (India) Limited, Nellore